ఎత్తినాం విరసం జెండా
అలలలలుగ వరదలొత్తు
పోరు పోరు జెండా

జనంకాళ్ళు చుట్టేసిన
సంకెల సంస్కృతిని దెంచి
చీకటి బతుకుల చేతికి
సూర్యుణ్ణి అందించి

గళగళమున క్రాంతి
ఝంఝ ఝళిపిస్తాం
ప్రతిఘటనా పాదంలో
పదపదమున పదభేరీ మోగిస్తాం

మార్చి 1979

89

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక

సంవత్సర చందా 15 రూపాయలు

ఈ సంచిక రు. 1-50 పైసలు

ఈ సంచికలో....



---

కవర్ : పరిటాల శ్రీరాములు హాల్‌లో విరసం సాహిత్య పాఠశాల జరిగిన మూడు రోజులు వరంగల్ రామనర్సయ్య నగర్‌లో ఎగిరిన విరసం జెండా.

---


SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road. Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

**89**

మార్చి 1979

ప్రతి జిల్లా మహాసభలోనూ మూడో ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని వివరిస్తూ,
రాష్ట్ర మహాసభలో మూడో ప్రపంచ యుద్ధ ప్రమాదం గురించి
సుదీర్ఘంగా చర్చించి రాజకీయ తీర్మానం రూపొందించి
సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో సకాలంలో తన పాత్రను
సమర్థవంతంగా నిర్వహించిన ఆంధ్ర ప్రదేశ్ రాడికల్ విద్యార్థి సంఘం
మూడవ రాష్ట్ర మహాసభలు అనంతపురంలో
ఫిబ్రవరి 24, 25 తేదీల్లో విప్లవోత్తేజంతో నిర్వహించినందుకు

సృజన హృదయపూర్వకంగా
అభినందిస్తున్నది.

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు ఈ సంచిక రు. 1-50 పైసలు

# మూడో ప్రపంచ యుద్ధ ప్రమాదం?

1970 మే 20న కాంబోడియాపై అమెరికా బాంబులు కురిపించినపుడు మావో ఒక చారిత్రాత్మకమైన ప్రకటన చేసాడు. "మూడో ప్రపంచ యుద్ధ ప్రమాదం కనిపిస్తున్నది. అయితే యుద్ధమైనా విప్లవాన్ని త్వరితం చేస్తుంది, విప్లవమైనా యుద్ధాన్ని నివారిస్తుంది." కాంబోడియా, వియత్నాం, లావోస్ ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక వీరోచిత పోరాటాలు మూడో ప్రపంచయుద్ధ ప్రమాదాన్ని నిలవరించగలిగాయి అనాడు. విప్లవ కాంపూచియా ప్రభుత్వం ఏర్పడింది. ఈసారి మూడో ప్రపంచ యుద్ధాన్ని రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదం సృష్టించే ప్రయత్నం చేస్తున్నది. ఆగ్నేయాసియాలో వియత్నామ్‌ను పావుగా వాడుకొని విశాలమైన చైనా మార్కెట్‌ను కైవసం చేసుకోవడానికి కుట్రపన్నుతున్నది. వియత్నామ్, లావోస్‌లను తన గుప్పిట్లోకి తీసుకున్నది. తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవడానికి ప్రయత్నించిన కాంపూచియాపై వియత్నామ్‌చే దురాక్రమణ చేయించింది. చైనా సరిహద్దుల్లో లక్షల సైన్యాలను మోహరించింది. తన రంగు ప్రపంచ ప్రజలకు అర్థం అయింది కనుక వియత్నాం పట్ల విశాల ప్రజానీకానికున్న సద్భావాన్ని, సంఘీభావాన్ని వాడుకోవాలని చూస్తున్నది. తాను నేరుగా దిగకుండా వియత్నామ్‌ను చైనాపైకి ఉసికొల్పుతున్నది. 'ఇది కూడ సహిస్తే ఇంక దేన్ని సహించజాలమ'ని చైనా సరిగానే ప్రశ్నించింది. వియత్నామ్‌కు తద్వారా రష్యన్ విస్తరణవాదానికి గుణపాఠం చెప్పాల్సిన తరుణం వచ్చిందని గుర్తించింది. వియత్నామ్-చైనా సంఘర్షణ విడిగా చూడవలసిన అంశంకాదు. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాల్లో ఒకచోట క్యూబాను, మరోచోట ఇండియాను, తాజాగా వియత్నామ్‌ను పావులుగా వాడుకుంటూ రష్యన్ సోషల్ సామ్రాజ్యవాదం అమలుచేస్తున్న ఆధిపత్య వ్యూహంలో భాగంగా చూడాలి. చైనాను చుట్టుముట్టడానికి బంగ్లాదేశ్, అఫ్ఘనిస్తాన్, వియత్నాం, లావోస్‌లను వలయంగా వలపన్నాలని చేస్తున్న కుట్రలో భాగంగా చూడాలి. ఇందుకు పరోక్షంగా అమెరికన్ సామ్రాజ్యవాదం మద్దత్తువున్నది. సామ్రాజ్యవాదాలు మార్కెట్లకోసం ఒకసారి పోటీపడుతూ, ఒకసారి కుమ్మక్కవుతూ ప్రపంచాన్ని కొల్లగొడుతుంటాయి. అమెరికా, రష్యా సామ్రాజ్యవాదాలు తమమధ్య ప్రపంచ మార్కెట్లను పంచుకునే లాలూచీలో రహస్య ఒప్పందానికి వచ్చాయి. ఇందులో భాగమే ఆగ్నేయాసియాపై రష్యా ఆధిపత్య ఆకాంక్ష.

మరి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలోవున్న ప్రజలు యుద్ధ ప్రమాదాన్ని తక్కువ అంచనా వేసినా, అలక్ష్యం చేసినా, ఇవి ఆయా దేశాలకు సంబంధించిన ప్రత్యేక సమస్యలుగా చూసినా తాము అసహాయులుగా అసహ్యమైన యుద్ధ ఫలితాలను అనుభవించాల్సి వస్తుంది.

యుద్ధాలు వద్దని కోరుకునే శాంతి స్వభావంగల ప్రజలంతా యుద్ధాలను రద్దు చేసే విప్లవ యుద్ధంలో పాలుపంచుకునే అవసరం మన తలుపుతట్టి పిలుస్తున్నది.

5-3-79

— సంపాదకుడు

## నా చిన్నారి తమ్ముళ్లకు కన్నీటి పాట - వెంకన్న

నాకన్నీరు- నీకన్నీరు
కలిగినోరికి పన్నీరైనది
ఒంటిగా ఓ! శోకం బెట్టే
చిన్నితమ్మయ్య
నీ జంటగా నేనుంటా[illegible]
చిన్నితమ్మయ్య ॥ఒం॥

కళ్లు తెరిచి తెరవకముందే
కన్నోరిడిసి ఎల్లేపోయిరి
చెత్తకుండే తండ్రయిపాకె
చిన్నితమ్మయ్య
ఆ నల్లా పంపే తల్లయిపాకె
చిన్నితమ్మయ్య ॥ఒం॥

ఆడిపాడె వయసులోనే
అడివి పాలైపోయెబతుకు
గొడ్లగాని బర్లమేపి చిన్నితమ్మయ్య
గోదాల్లోనే కల్పినావా
చిన్నితమ్మయ్య ॥ఒం॥

బండ్లు లాగి బరువులు మోసి
పెయ్యి కాయలు గాసినాదా
సదువులేక, పుర్సతులేక
చిన్నితమ్మయ్య
బతుకు బజారు పాలైనాదా
చిన్నితమ్మయ్య ॥ఒం॥

బూట్లు తుడిపి పాలీసుజేసి
కసురుతున్న కాళ్లు బడితే
పట్టెడన్నం నీకే కరువా
చిన్నితమ్మయ్య
పస్తులే కళ్లజూసితివా
చిన్నితమ్మయ్య ॥ఒం॥

బాసండ్లు గడిగి- [illegible]
కలిగినోని కొలువు జేత్తె
సాపపోయిన వంగి[illegible]
చిన్నితమ్మయ్య
ఈపుమీన కర్రదెబ్బలు
చిన్నితమ్మయ్య ॥ఒం॥

నీ చీమునెత్తురు పిండుకొని
ఆ హోటలోరు బలిసిరికాదా!
సీసీముగారే సేతులు మండితే
చిన్నితమ్మయ్య
గుండె సెరువై ఏడ్సినావా
చిన్నితమ్మయ్య ॥ఒం॥

నీ నెత్తురుతోనె రిక్షనడిపే
కండ్లచీకటి కమ్ముకచ్చె
కాడుకింద నలిగిపోతివా చిన్నితమ్మయ్య
నువ్వు కాలిరిగి కుంటైపోతివా
చిన్నితమ్మయ్య ॥ఒం॥

ఇల్లు వాకిలి లేకనువ్వు
టేషన్ కాడ పండుకుంటె
దొంగను జేసి బెల్ల బోసిరి
చిన్నితమ్మయ్య
మనిషిని దొంగను జేసెనంట..
చిన్నితమ్మయ్య ॥ఒం॥

చిన్నిపొట్ట కూటికినువ్వు
పుట్టెడు కట్టం చేస్తివికాదా
నీకు కష్టఫలితం దక్కకపాయె
చిన్నితమ్మయ్య
చెప్పుకునే దిక్కులేదాయె
చిన్నితమ్మయ్య ॥ఒం॥

నిన్ను కన్నోళెవలో నీకున్నోళెవలో
దిక్కులేని పచ్చిపైతివి
సర్కారుండి ఏమి లాభము
చిన్నితమ్మయ్యా
నీ బతుకు మారే దెప్పుడు
చిన్నితమ్మయ్యా ॥ఒం॥

కష్టాలు దీర్చి బతుకునిచ్చె
ఎఱ్ఱజెండా ఎగురుతున్నది
ఎఱ్ఱని తోవల పరుగులుతీయి
చిన్నితమ్మయ్యా
చేయిచేయి కలిపినదువరా
చిన్నితమ్మయ్యా ॥ఒం॥

యునిసెఫ్ రిపోర్టు ప్రకారం 1978 లో ఒక కోటి ముప్పై లక్షలమంది పిల్లలు ఐదు సంవత్సరాల వయసులోపుగానే మరణించారు. వీనిలో ఒక కోటి పది లక్షల శిశుమరణాలు మూడో ప్రపంచంలోనే.

1979 ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా అన్ని దేశాలు గుర్తించాయి. బాలల సంక్షేమం కోసం కోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నట్లుగా (అంకెల్లో) ప్రకటించాయి. పేపరు తీర్మానాలు మామూలుగా అనవాయితీగా ప్రకటించాయి.... (లోగడ మహిళా సం॥లో మహిళలకు చేకూరిన లాభాల సంగతి అందరికీ తెలుసు).... తీర్మానాలకు, వాగ్దానాలకు మనదేశం ముందే కనుక సహజంగానే భారతదేశం 'బాలల సంవత్సరం' గురించి ఊకదంపుడు కబుర్లు చెప్తున్నది.

నిజంగా భారత దేశపు బాలల స్థితి ఏమిటి? ప్రభుత్వ అంకెల ప్రకారమే– విద్యకోసం ప్రభుత్వంచేసిన ఖర్చు 2500 కోట్ల రూపాయలు. రోజుకు తలసరి ఖర్చు అర్ధరూపాయి మాత్రమే. 10 సం॥ పై వయసు కలిగిన పిల్లల్లో నిరక్షరాస్యులు 60%, 5–15 సం॥ పిల్లల్లో 20% పిల్లలకు బడి గురించి తెలియదు. చదువుల బడికి వెళ్ళిన పిల్లల్లో 11 లేక 12వ క్లాసు వరకు 10% మాత్రమే వెళ్ళగలుగుతున్నారు. అందులో 1–2 డిగ్రీ దాకా వెళ్ళి ఆ తర్వాత....

దేశ జనాభాలో 14 సం॥ పిల్లలు 25 కోట్లు– ఇందులో 75% (18 కోట్లు) నికృష్టమయిన దరిద్రంతో బతుకుతున్నారు.

మన కవులు రాసే 'చిట్టిపొట్టి పిల్లలు' ఐదేళ్ళ లోపున్నే నాలుగు లక్షల మంది పౌష్టికాహారంలేక (అసలు ఆహారమేలేక) మరణిస్తున్నారు. పుట్టీపుట్టకముందే 14% పిల్లలు చనిపోతున్నారు.

1971 జనాభా లెక్కల ప్రకారం 12 సం॥ లోపు మూడు కోట్ల మంది పిల్లలు కూలీలుగా, పసుల కాపరులుగా, ఇతర బాలకార్మికులుగా పనిచేస్తున్నారు.

లక్షన్నర దేశదిమ్మరులుగా, బిచ్చగాళ్ళగా ఉంటున్నారు.

ఇంకా జైళ్ళల్లో 5% పిల్లలు విచారణలు లేకుండా, శిక్షలు పడి, రోగాలు నొప్పులతో బాలనేరస్తులుగా బతుకుతున్నారు.

ఇన్ని రకాలుగా భావిభారత పౌరులు, చిరుప్రాయంలోనే చితికిపోతున్నారు. కలవారి దోపిడీ కోరల్లోపడి క్రూరంగా నలిగిపోతున్నారు.

# "కళ కళకోసం కాదు, విప్లవం కోసం"



కళ కళకోసం కాదు, కళ ప్రజల కోసం అని, విప్లవ సాధనకు అది ఒక ఆయుధంగా ఉపయోగపడా లని మహాకవి శ్రీశ్రీ అన్నారు. కళాకారుడు విప్లవ సాధన కోసం జరిగే మహోద్యమానికి తన కళను అంకితం చేయాలి. అందుకోసమే దానిని వినియో గించాలి. అప్పుడే అది నిజమైన కళ అవుతుంది అని ఆయన 'ఈనాడు' ప్రతినిధితో మాట్లాడుతూ అన్నారు.

ఈ విషయాన్ని మీరు ఒక సిద్ధాంతానికి కట్టుబడిన వ్యక్తిగా చెబుతున్నారా? లేక కళాకారునిగా చెబుతున్నారా? అని ప్రశ్నించగా కళాకారుడు, ఆదర్శవాది వేరు కారని ఇద్దరూ ఒక్కరేనని ఆయన స్పష్టంచేసారు.

కళ కళకోసం, కళ ధనసంపాదనకోసం, కళ ప్రజలకోసం, కళ విప్లవసాధన కోసం- ఈ నాలుగు సూత్రాల్లో ఏది ఉత్తమ మార్గం అని అడగగా కళ విప్లవాన్ని తీసుకురావడానికి సాధనం కావాలి. అప్పుడే అది ప్రజా కళ అవుతుంది అనిఆయన చెప్పారు.

సూర్యాస్తమయం వేళ హోటల్ గదిలో చలికి భయపడుతూ ఆయన దుప్పటి కప్పుకుని పడుకొని వున్నారు. ఆరోగ్యం బాగున్నట్టు లేదు. భారత-చైనా మిత్రి మండలి వారి బహిరంగసభకు హాజరు కావలసింది కానీ వెళ్ళలేకపోయారు. వొంట్లో తగుఉత్సాహం లేక బద్దకంగా పడుకున్నారు. ప్రశ్నలకు తాపీగా విశ్రాంతిగా సమా ధానాలిస్తూ కూడా కళ కళకోసమే అన్న నినాదం గురించి ప్రస్తావన వచ్చినప్పుడు "ఇది పశ్చిముసుగు కప్పుకుని రంగప్రవేశంచేస్తోంది. దానిని రానివ్వకూడదు" అని కోపంగా అన్నారు.

"నేను మహాప్రస్థానం రాస్తున్న రోజుల్లో ఇది కవిత్వంకాదు నినాదాలు మాత్రమే అన్నారు. 20 సంవత్సరాల తరువాత దానిని కవిత్వంగా అంగీకరించారు. ఇప్పుడు విప్లవరచయితలు రాస్తున్నది కవిత్వమేనని పది సంవత్సరాల తరువాతయినా అంగీ కరించక తప్పదు" అని అన్నారు.

గుంటూరు శేషేంద్రశర్మ గురించి కవిసేన గురించి ప్రస్తావన వచ్చినప్పుడు మ్యానిఫెస్టో తాను చూడలేదన్నారు. శ్రీశేషేంద్రశర్మ కళ కళకోసమే అన్న సనాతన వాది అని ఎంత నిప్పులు కురుస్తున్నట్టు రాసినా ఆయనలో ఆ సనాతనవాద ధోరణి కనపడకుండా పోదని శ్రీశ్రీ అన్నారు.

మంచి కవిత్వం రాయాలంటే మార్క్సిజం చదవాలన్న వాదన వుంది ఇది ఎంతవరకు సమంజసం అని అడగగా "గురజాడఅప్పారావు మార్క్సిజం చదువుకోలేదు. కాని ఆయన కన్యాశుల్కంలో కనబడే సామాజిక పరిశీలన చాలా గొప్పది. మార్క్సిజం చదివినవాడికే అది సాధ్యమవుతుంది. గురజాడ శిక్షణద్వారా, అధ్యయనం ద్వారా మార్క్సిస్టు కాకపోవచ్చు, కాని ఆయనలో అలాంటి భావాలు వ్యక్తమయినాయి".

"అలాగే నేను మహాప్రస్థానం రాసేనాటికి మార్క్సిజం చదువలేదు. ఐతే మయకోవస్కీ లాంటి మార్క్సిస్టు రచయితల రచనలు, కవిత్వం చదివాను వారి ప్రభావం నామీదవుంది. అలాగే అప్పుడు చాలామంది యువరచయితల మీద అప్పుడు వీస్తున్న గాలి ప్రభావం వుంది— మార్క్సిజం ప్రేరణవుంది" అని శ్రీశ్రీ వివరించారు.

కాళహస్తీశ్వర శతకంలోని "వేదంబు పఠించెలూత...." అన్న పద్యాన్ని ఉదహరించి ఏ వేదాలు చదవకపోయినా విజ్ఞానసంపద అంటకపోయినా భక్తితత్వం ఏర్పడినట్టుగానే ఒకదశలో ప్రపంచవ్యాప్తంగావున్న మార్క్సిజం ప్రభావం పలు రచయితలమీద పనిచేసిందని ఆ విధంగానే మార్క్సిజం చదివితే మంచి కవిత్వం రావడానికి అవకాశం వుందని ఆయన పరోక్షంగా సూచించారు.

## మహాకవి శ్రీశ్రీ ఇంటర్వ్యూ

తాను ఇప్పటికీ విప్లవ రచయితల సంఘం సభ్యుడుగా కొనసాగడానికి ఎవరి బలవంతమూ కారణం కాదని తన ఇష్టపూర్తిగానే తాను వి.ర.సం. లో వున్నానని ఆయన అన్నారు. సాహిత్య, సాంస్కృతిక, సామాజిక ప్రయోజనాలకు దోహదం చేయగలిగిన సాహిత్యసంస్థ ఏదయినా వుంటే అది విరసం ఒక్కటేనని కూడా ఆయన విశ్వాసం ప్రకటించారు.

బూర్జువా సంస్కృతికి వ్యతిరేకంగా శ్రామిక సంస్కృతిని నిలబెట్టడమే ఏ సాహిత్యసంస్థ అయినా చేయగల సత్కార్యమని ఆయన అన్నారు. విరసం దీనికి దోహదం చేస్తున్నదని అన్నారు.

పాటల రూపంలో వస్తేనే ఉత్తమ కవిత్వం, అది ప్రజలకు త్వరగా అందుతుంది అంటున్నారు కదా? అని అంటే అది 'కరెక్టు'అని ఆయన అన్నారు ఈ సందర్భంలో కవిగా మీస్థానం ఏమిటి? అంటే నేను కవిగాకంటే కవితా విమర్శకుడుగానే ఎక్కువగా పనిచేస్తాను అన్నారు. వచన కవిత్వం వదిలేసి పాటలు రాస్తారా? అంటే "నేనుపల్లెవాతావరణం తెలిసినవాణ్ని కాను. పట్టణాలలో పెరిగిన వాణ్ని అందువల్ల జానపద పద్ధతిలో

కవిత్వం రాయలేను" అని అన్నారు. వంగపండు గద్దర్ రాస్తున్న కవిత్వాన్ని ఆయన ప్రశంసించారు.

భారతదేశంలో విప్లవం వస్తుందా? అని ప్రశ్నించగా 'చీపురుపుల్లలతో విప్లవం రాదనీ, ముందు పీపుల్స్ రెడ్ ఆర్మీ ఏర్పడాలని అన్నారు. వామపక్ష శక్తుల ఏకీకరణ మంచిదని అనుకుంటున్నారా? అంటే 'తప్పనిసరిగా' అని జవాబిచ్చారు అయితే పరిపక్వమైన పరిస్థితి వచ్చినపుడే అందులో నుంచి విప్లవ నాయకుడువస్తాడని ఆయనఅన్నారు.

విప్లవ సంస్కృతీ శ్రేణుల మధ్య ఐక్యత అవసరమని అన్నారు. దున్నేవాడికి భూమి లభించినపుడే ఎక్కడయినా నిజమయిన అభివృద్ధి సాధ్యమవుతుందని చెప్పారు.

విప్లవానికి రక్తపాతం అక్కరలేదు, ఓట్లద్వారానే విప్లవం వస్తుందన్న పార్టీ ఏదీకూడా రివల్యూషనరీ పార్టీకాబోదని ఆయన విశదపరచారు.

"2001 సంవత్సరానికి ముందే విప్లవం వస్తుందా?"

"నేను ఆశావాదిని ఇంకాముందే వస్తుందని అనుకొంటున్నాను నా జీవితకాలంలో విప్లవాన్ని చూడాలని కోరిక."

[మహాకవి శ్రీశ్రీతో 'ఈనాడు' 4-1-79 ఇంటర్వ్యూ నుంచి కొన్ని భాగాలు]

---

Statement about ownership and other particulars about newspaper

**SRJANA**

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | ... ... | Warangal 506 001 |
| 2. | Periodicity of its publication... | | Monthly |
| 3. | Printer's Name | ... ... | P. Hemalatha |
| | Nationality | ... ... | Indian |
| | Address | ... ... | Hanamkonda, Warangal 506001 |
| 4. | Publisher's Name | ... ... | P. Hemalatha |
| | Nationality | ... ... | Indian |
| | Address | ... ... | (same as above) |
| 5. | Editor's Name | ... ... | P. Hemalatha |
| | Nationality | ... ... | Indian |
| | Address | ... ... | (same as above) |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | | — |

I, P. Hemalatha hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**Sd/- P. Hemalatha**
*Publisher.*

విరసం సాహిత్య పాఠశాల - ప్రసంగ వ్యాసాలు :

# కథ, నవల - జీవితం

1927 ఏప్రిల్ 9వ తేదీన కాంగ్‌ఫూ మిలిటరీ అకాడమీ విద్యార్థులనుద్దేశించి ప్రముఖ చైనా విప్లవ రచయిత లూసున్ మాట్లాడుతూ- "ఒక ప్రక్కన తుపాకీ కాల్పులకు, నిషేధాలకు, నిర్బంధాలకు ప్రజలు తీవ్రంగా గురవుతున్నప్పుడు, శక్తి హీనులు, ఎందుకూ పనికిరానివారు మాత్రమే సాహిత్యం గురించి మాట్లాడుతారు. పీడించే వాడెన్నడూ మాట్లాడడు- చంపుతాడు. పీడితుడే చావడం గురించి మాట్లాడుతాడు- రాస్తాడు. ప్రతిఘటించే శక్తి లేనప్పుడు కొంత మంది తప్పించుకోవటం కోసం ప్రదర్శనలు జరపడం, ఫిర్యాదులు చేయడం, అసమ్మతిని ప్రకటించడం చేస్తారు."

నిజమే వర్గ సమాజంలో పీడింపబడేవాడు, పీడించేవాడు ఇద్దరూ ఆ క్రియ జరుగుతున్నంతసేపు అసలేం మాట్లాడరు- (ఆ తంతు జరుగుతున్నంతసేపు) ఎవరికీ అరిచే అవకాశం, సమయం లేదు. దీనికి ఉదాహరణగా పిల్లి ఎలుకలను చెప్పుకొస్తాడు.... చుంచెలుకలు కీచకీచలాడవచ్చు, సుందరమైన సాహిత్యాన్ని సృష్టించవచ్చు... కాని పిల్లి ఎలాంటి మినహాయింపులు లేకుండా ఎలుకను గుటకాయస్వాహా చేస్తుంది. కనుక ఫిర్యాది సాహిత్యం నిష్ప్రయోజనం.... ఫిర్యాది సాహిత్యం సృష్టించే జాతి అంతటితో నశించిపోతుంది. అయితే లూసున్ విప్లవ సాహిత్యంకంటె విప్లవ పార్టీ ఆవశ్యకతను నొక్కి చెప్పిన విషయాన్ని మనం గుర్తించాలి. అంతమేరకు మన విప్లవ రచయితలకు ఆక్షేపణ లేదనుకుంటాను.

లూసున్ వాడిన 'చేతకాని తనాన్ని' మనం ఇప్పుడు స్పందన లేక సృజన ఇత్యాది పేర్లతో పిలుచుకుంటున్నాం. లూసున్ అంత కరుకుగా, ఖచ్చితంగా చెప్పడం కొంచెం విడ్డూరంగా కనిపించినా అప్పటి చారిత్రిక కారణాల (తుపాకీ కాల్పులు, నిషేధాలు, నిర్బంధాలు) ననుసరించి అది తప్పనిసరేనని మనం గుర్తించాలి.

లూసున్ మాటలు విన్న తరువాత సమాజంలో సాహిత్యం పాత్ర గురించిన ప్రశ్న కూడా తలెత్తుతుంది- సమాజంలో కలం సైనికుల పాత్ర మనకు తెలుసు.

అదే ప్రసంగంలో లూసున్ చెప్పిన మరోమాట కూడా మనం ఇక్కడ చెప్పుకోవాలి. 'బాధ నుండి పేదరికం నుండి కవిత్వం పుడుతుందని కొందరంటారు. అది ఉత్త భ్రాంతి. పేదవాడు వ్రాయలేడు. ఆకలిగొన్నవాడు కవితాగానం ఎట్లా చేస్తాడు? కూలివాడు వ్రాయాలంటే తన నెత్తిమీది బరువును పక్కన పెట్టాలి.

రిక్షావాడు వాగ్రియాలంటే ముందు రిక్షాను అవతల పెట్టాలి. రిక్షా అవతల పెడితే కడుపు మాడుతుంది."

ఇదే విషయాన్ని లెనిన్ - ఒకసారి రహస్య జీవితం గడుపుతూ, నదీ తీరంలో, సుందరమైన ప్రదేశంలో ఉంటాడు. అతననుకొంటాడు - "గోర్కీ ఉండవలసిన ప్రదేశంలో నేనున్నా"ని.

ఈనాడు ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లాల్లో ప్రజలు పోరాటంలో ఉన్నారు. నేను వాళ్ళ దగ్గరి నుండి సాహిత్యం సేకరించాలని చాలా ప్రయత్నాలు చేశాను. నిజానికి వాళ్ళకు మాట్లాడే తీరికలేదు - సాహిత్యం రాయడానికి అసలు తీరికేలేదు. నా వొత్తిడి మూలకంగా, ఇతర సాహితీ మిత్రుల కృషి వలన కొంత సాహిత్యం మనకు అక్కడి నుండి అందింది - నేను వాళ్ళను వెడగొడుతున్నానే మోన నేభావన నాకు అనుభవపూర్వకంగా కలిగింది. అయితే వచ్చిన సాహిత్యంలో కూడా అత్యధిక భాగం పోరాటంతో నేరుగా సంబంధంలేని వారి నుండే వచ్చిందనేది నేను గమనించిన ముఖ్య విషయం.

జీవితంలో జరుగుతున్న అనేకానేక సంఘటనలే ఏ సాహితీ ప్రక్రియకైనా ముడిసరుకు. జీవితంలో చాలా వేగంగా వస్తున్న మార్పులు ముఖ్యంగా కథ, నవల వంటి సాహితీ ప్రక్రియల్లో ప్రతిఫలించకపోతే అవి కథలు, నవలలు కావు. వాటిని మరేపనాలో నాకైతే తెలియదు.

మాయా 'కథ, నవల'ల గురించి కొంత మాట్లాడాలి. ఇటీవల నేనొక తెగులు నవల చదివాను - అందులో హీరోయిన్‌చేసిన ఉప్మా హీరో తింటూఉంటాడు - ఖర్మ కాలి ఆరడుగుల హీరోకు ఉప్మాలో ఉల్లిపాయ వస్తుంది. అదీ పంటికింద పడుతుంది - హీరోగారు వేదాంత ధోరణిలో "ఉప్మాలోని ఉల్లిపాయలాగ జీవితంలో సంఘటనలుంటాయి కదా?" అంటాడు.

హీరోయిన్‌గారు అర్జంటుగా నిట్టూర్చి - "ఔను.... జీవితమంటే అంతేకదా?"

ఇలాగే అరవై పేజీలు ఊదర గొట్టేస్తుంది - దీన్ని ఇంకో కవిమిత్రుడు "వంటింట్లోనుండి వాకిట్లోకి" నడిచేసరికి సీరియల్ నవల కక్కేయడమన్నాడు.

అలాంటి సోదర రచయితల రచయిత్రుల విరహాలు, ప్రేమలు వగైరాచెప్పి మిమ్మల్ని బోరు కొట్టించ దలుచలేదు.... కాని ఆవైపు సాహిత్యానికున్న ప్రచారానికి నాకు ఈర్ష్యగానే ఉన్నది.... చలసాని ప్రసాద్‌గారు ఒకసారి "జీవన తరంగాలు" నవల రెండు లక్షల ప్రతులు అమ్ముడు పోయినట్టుగా చెప్పాడు....

వర్గసమాజంలో 'జీవితం' తప్పనిసరిగా వర్గస్వభావాన్నే కలిగి ఉంటుంది. కవులు, ఇతర సాహితీ ప్రక్రియల్లో కృషిచేస్తున్న కళాకారులకంటే, నవలా-కథా రచయితలకు, దోపిడీవర్గం, దోపిడీకి గురైతున్నవర్గం, ఈ రెండురకాల జీవితం గురించి, అందులోని వైరుధ్యం గురించి, అంతస్సంఘర్షణల గురించి తప్పకుండా స్పష్టమైన అవగాహన అవసరం.... కథా- నవలా రచయితలు ఈ ప్రధాన భేదం గుర్తించకుండా రాస్తే అవి కథలు-నవలలు కావని నా అభిప్రాయం.

జీవితంలోని సంఘర్షణను చారిత్రిక గతితార్కిక భౌతికవాద అవగాహనతో పరిశీలించకపోతే- ఇంకోరకంగా చెప్పాలంటే జీవితాన్ని అతిదగ్గరగా శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించకపోతే కొడవటిగంటివారి పరిభాషలో "స్టీరియోటైపు" సాహిత్యం వస్తుంది. ఆ పని మాయా సాహిత్యం చేస్తోంది- ఆ మేరకు ఎనిమిదో తరగతి చదివిన పదునాలుగేండ్ల విద్యార్థి ప్రేమకథలు రాసినట్టే- ఈమధ్యలో ఒక ఔత్సాహిక రచయిత హైదరాబాదులో బీచివిహారాల గురించి బ్రహ్మాండంగా రాశాడు.

విప్లవ రచయితకు ప్రజల జీవితం గురించి అందులోని సంఘర్షణల గురించి పరిశీలన, దానినుంచి ఏర్పడే ఒక ఖచ్చితమైన అవగాహన ఉండాలి. అది ప్రజలకు సక్రమంగా అందించగలగాలి.

నేను ఇప్పుడు పోరాటప్రాంతంలో కాకతాళీయంగా ఉన్నాను.... అక్కడ జీవితం అత్యంత వేగంగా మార్పు చెందుతోంది. ఆ వేగాన్ని అందుకోవడం- అందించడం నాశక్తికి మించిన పనే- నిజంగా నేను రాయాలంటే ఇప్పుడు వేల కథలకు, నవలలకు సరిపడే ముడిసరుకు అక్కడ ఉన్నది.

నేను కొన్ని కథల గురించి మీకు చెప్పి ముగిస్తాను- నిజంగా జరిగిన విషయం ఎలాఉంటుందో (ఎలా చెప్పగలరో!) కథకుడుదాన్ని ఎలాస్వీకరిస్తాడో మీరేఆలోచించాలి.

1

ఒక గ్రామంలో రైతుకూలీ సంఘం ఆధ్వర్యంలో పాలేర్ల పోరాటం జరుగుతున్న సమయం- అప్పటి పోరాట రూపం సమ్మె- ఇలాంటి సమయంలో పోలీసు అమీన్ అక్కడి దొరల పక్షాన వచ్చి పాలేర్లను సమ్మెమానుకొమ్మని సలహాయిస్తూ-

"ఒరే గిప్పుడు మీరు కానిదిపోనిది మొదలేసుకున్నరు. ఎనుకటినుంచి బతుకత లేరా? ఎనుకటినుంచి లేనిది గిప్పుడు సంఘాలు గింగాలని ఎగురుతే మీరే సెడిపోతరు." అంటాడు.

అప్పుడు సన్నగా పీలగా ఉన్నపాలేరు ముందుకువచ్చి—

"అయ్యా! అమీన్ దొరా తమరు మాకు బుద్ధిగానెం సెప్పెటందుకే అచ్చింఢ్లు గాదుబాంచెన్.... మంచిమాటే కనినేను కొన్ని ముచ్చెట్లడుగుత కోపానికి రావద్దు బాంచెన్"

"కోపమెందుకురా అడుగు"

"అమీన్‌దొరా! తమరి కెంత జీతముండ్లి"

"ఐదువందలు"

"కోప్పడకుండ్లిదొరా! దొర్సాని ఏంపని జేత్తదుండ్లి?"

"దొర్సాన్లకు పనేందిరా?"

"తమరికి కొడుకు లెంతమంది బాంచెన్...."

"ఇద్దరు...."

"వాళ్లేం జేత్తరుండ్లి...."

"ఏంజేత్తరారి ఎడ్డిముండకొడుక సదువుకుంటరు."

అప్పుడు పాలేరు ఇంకేమి మాట్లాడేది లేనట్టుగా కాసేపాగితలెత్తి అమీనుముఖం లోనికి చూస్తూ కొంచెం కంఠంపెంచి అందరికి వినపడేలా—

"దొరా! తమరు కాలుమీన కాలేసుకొని సికిలేటు తాక్కుంట గంజిబెట్టి ఇత్రి సేసిన కడక్ ఢిరేసు లేసుకొని; తమరి దొర్సాని రంగు కోకలు గట్టుకొని అటున్నపుల్ల ఇటు బెట్టకుంట, తమరి కొడుకులు ఇస్కూల్లల్ల సదుకుంటాంటే— నేనుసూడు దొరా పెయికంగి లేకుంట ఎండల, ఆనల, సలిల రాత్రి పగలు సారెడు నెత్తురు పురిసెడు సెమటకాంగ పన్జేత్తే నూర్రూపాలత్తలేవు.... మేం మీ తీరుగ గాకున్న గీ జానెడు పొట్ట నిండుతె సమ్మెలెందుకు జేత్తం బాంచెన్? శాత్రి పురండాలు జెప్పుకుంట తిరిగెటోల్లం...."

అమీన్‌సాబు నోరు టక్కున మూసుకపోయింది....

ఇక్కడ పాలేరు జీవితంలో వచ్చిన చైతన్యాన్ని మనం గుర్తించాలి. వాళ్లమీద దోపిడి జరుగుతుండడం వాళ్లకు అనాదిగా తెలుసు— వాళ్లిప్పుడు కొత్తగా నేర్చుకున్నది— దొరల, వాళ్ల ఏజెంట్ల బ్రతుకుల గురించి తార్కికంగా **ఆలోచించడం**— తమ బ్రతుకులు **మారటానికి పోరాటమే** ఏకైక **మార్గమని**.... రచయితలు పాలేరు చైతన్యాన్ని అర్థం చేసుకొన గలగాలి.

## 2

ఇంకొక ఊళ్లో రైతుకూలీ సంఘనిర్మాణం జరిగిన తరువాత వాళ్లుదొర కెదురు నిలిచి చేస్తున్న పోరాట క్రమంలో 'దొరకు సాంఘిక బహిష్కారం విధించడం. దొర ఆధీనంలో ఉన్న కారజ్‌కిత్తాలు, ఇనాము భూములు, పరంపోగు భూములు రైతుకూలీ సంఘం సమిష్టిగా స్వాధీన పర్చుకొని, సమిష్టిగా దున్నుకున్న సమయంలో దొరకు అండగా పోలీసు బలగాలు వచ్చాయి.... పోలీసులు ఆగ్రామంలో భీభత్సం సృష్టించి మొత్తం గ్రామంలోని పురుషులను అరెస్టు చేశారు.... లాకప్‌లో పెట్టారు- ఆగ్రామంలో కేవలం స్త్రీలే మిగిలిపోయారు.

ఆగ్రామ స్త్రీలను ధైర్యంగా ఉండుమని ఎవరు చెప్పాలి అన్న సమస్య పక్కఊరి రైతుకూలి సంఘానికి ఏర్పడ్డది– వాళ్ల తర్జనభర్జనలు పడుతుంటే అదిచూచిన పదిసం॥ వయసుగల పిల్లవాడు ఆరోజంతా తీవ్రంగా ఆలోచిస్తూ అన్నం తినకుండా పిచ్చిగా ఊరంతా తిరుగుతూ గడిపాడు. చీకటి పడుతుండగా ఒక బిచ్చగాళ్ల పిల్లగాడు సందా కబలం (రాత్రి అన్నం) అడుక్కోను వచ్చాడు. ఆ బిచ్చగాళ్ల పిల్లవాడు ఇంటింటికి ఇలాగ అరుస్తూ తిరుగుతున్నాడు.

"అక్కో ! అక్కో ! అక్క....
బుక్కెడు బువ్వెయ్యక్క....
నీ తమ్ముడొచ్చిన్నక్క....
సీరెలు దెచ్చిన్నక్క....
సారెలు దెచ్చిన్నక్క...."

విచారిస్తున్న అబ్బాయికి ఆ పద్ధతి నచ్చింది. తనూ ఆ అబ్బాయితో తిరిగి ఇంకొంత పాటనేర్చుకొని ఆరాత్రి పోలీసు క్యాంపున్న ఊళ్లోకివెళ్లి....

నీతమ్ముడొచ్చిన్నక్క!
అర్తలు దెచ్చిన్నక్క!
అన్నల జూసిన్నక్క!
అక్కో! అక్కో! అక్క!
సక్కంగుండుడక్క!
బుగులు పడకుండ్లక్క!
ఫికరు పడద్దక్కా!" ఇలాగా అన్ని సంగతులు వాళ్లతో మాట్లాడి రాగలిగాడు.

ఇక్కడ మనం గమనించ వలసిన మార్పు జీవితం పోరాట ఎత్తుగడలను నేర్పిన విధం.

## 3

ఒకసారి బాగావంగిపోయిన ముసలాయన వీపుకు రొట్టెలుకట్టుకొని దున్నపోతును కొనుక్కపోతూ కనిపించాడు.

"ఏవూరు పన్ది తాతా!" నేనడిగాను.

"లొత్తునూరు." అన్నడు ముసలయ్య.

నేను ఆశ్చర్యపడి ముసలయ్యకు కొంచెం దగ్గరదాకా నడిచాను. ముసలయ్య నా ముఖంలో మారిన రంగులు గమనించి–

"ఏందుండ్లి గట్లయి పోయిండ్లు?" ముసిముసి నవ్వుతూ.

"ఏంలేదు తాత మొన్న పేపర్ల మీ ఊరుసంగతులు సదివింటి."

ముసలయ్య నడుస్తున్నవాడు ఠక్కున ఆగిపోయిండు.

"ఏమని రాసిండ్లు బిడ్డా?"

నేను రాసింది చెప్పిన– ముసలయ్య ముఖం మాడ్చుకొని "లుచ్చెలంజకొడుకులు గాదుబిడ్డా! గరీబోని సంగతనేటాల్లకే ఎల్లికి మల్లి బుట్టిత్తరు–" అని తనూ కొన్ని విషయాలు చెప్పుకొచ్చిండు....

మేమిద్దరము అలా కొంత దూరం నడిచాము. మా ఇద్దరికి కొంచెం స్నేహం ఏర్పడ్డది.

"తాతా గంత దూరం నుంచచ్చి దున్నపోతును కొనుక్కపోతన్నవ్– పోలీసోల్లు నాగండ్లిడిసేత్తంటే.. సూడవోతె నువు కొత్త నాగలే తయారు సేత్తన్నవ్"

"ఎవలుంచేంది బిడ్డా! బూమి గురించి ఆ లమ్డికొడుకుల కేమెరుక? దున్నిందో, దొకిందో? గీ ఆనకాలంల సూడు గోరెడు భూమి లేకుంట దున్నుతం.... తొలి సినుకు పడ్డంక సూడు."

ముసలయ్యను చూస్తే నాకు ఆశ్చర్యమేసింది.

"నువ్వేనా దున్నేది?"

"బొ మల్ల ఏమనుకుంటన్నవ్. నా కొడుకు, అల్లుడు గుట్లల్లున్నరు. ఆళ్ల పేరు జెప్పుతె ఉచ్చబడాలె...."

"ఒరి ముండాకొడుకా! అయితె నీగ్గూడ దగ్గెరకచ్చింది తాతా! పోలీసు తానకు పట్టుకపోతరు ఒర్రింగ. బిడ్డా గప్పుడు ఇంకెవలు దున్నుతరు?"

ముసలయ్య కొంచెం సేపు రందిపడి....

"అయితే బిడ్డా! ఏన్నన్న పసురాలకు జేల్లున్నయా?"

"ఏడెందుకు మీ ఊళ్లె బంచెల దొడ్డిలేదా?"

"బానో౯ పురిసే పోయిన.... సరె నాగండ్ల జేల్లు...."

"నా కెరుకున్నంతవరకు ఏడలేవనుకుంట- కావాలంటె కట్టిత్తరు."

ముసలయ్య ఆవేశంతో వణికే కంఠంతో-

"నన్ను పట్టుకపోతే నా కొడలు, బిడ్డా దున్నుతరు. అళ్లను బట్టుకపోతె ముసల్ది దున్నుతది. దాన్ని పట్టుకపోతె నా మనుమడు గెట్టుమీన కూకుంటె దున్న పోతులె దున్నుక పోతయి."

"గెట్టుమీది మనుమన్ని గద్దలు తన్నుక పోతయి."

"ఆడుబోతె దున్నపోతులే...."

"ఏమో వాటిని పట్టుకపోతే...."

"నాగలి దానికదే నడుత్తది...."

"దాన్ని ఎత్తుకపోతే...."

"దుత్తెరి తల మాసినోడా! గప్పుడు బూదేవర సెరసెర సెక్కలైతది- సెక్కలైన బూదేవర్ల నుంచి మొలుకలు మొలుసుకత్తయి- అంత వరదనుక మేం సేతులు ముంగట బెట్టుకొని కూసుంటమా?"

ఇక్కడ ముసలయ్య జీవితం ముసలయ్యకు నేర్పిన "పట్టుదల" (పోరాట చైతన్యం) గురించి మనం పట్టించుకోవాలి.

## 4

మరొక ఊళ్లో మరొకదొర.... ఫ్యూడల్ లక్షణాలు నూరు శాతం గలిగిన దొర.... అతనో ఆంబోతును పెంచి, దేవుని పేరు మీద ఊరిమీద ఒదిలేశాడు, ఆ ఆంబోతుకు ఎదురులేదు.... ఎదిగిన ఎవరి చేండ్లు, పొలాలైనా అట్టహాసంతో వెళ్లి తాను తినడమే కాకుండా, చెంగలిచ్చి పట్టంతా పొరుకాపోడు చేసేది.... అంతంతమాత్రాన్నే ఉన్న పంటల అదిఅలా సర్వనాశనం చేస్తుంటే చేతులు జోడించుకొని వలవల ఏడుస్తూ మొక్కేవాళ్లు రైతులు. అందుకు రెండు కారణాలు. ఒకటి ఆ ఆంబోతు దొరది కావడం రెండోది దాన్ని దేవుని పేరుమీద "జన్నెకిడుపడం...." దాన్ని అదిలిస్తే ఇద్దరికీ కోపంరావచ్చు కనీసం ఏ ఒక్కరికి కోపమొచ్చినా సర్వనాశనమై పోతామని

వారి నమ్మకం.... ఆ అంబోతు అలాఅలా మేసిమేసి బాగా బలిసిపోయింది. రోషం బీకుతె నెత్తురు చిమ్మే విధంగా.... చేండ్లు మేసి సాయంత్రం పూట రాజఠీవితో ఇండ్లకు మరలే పశువుల మందల మీదికొచ్చి- నానాహంగామా చేస్తూ, పశువులను కుమ్ముతూ, ఒక విధమైన కల్లోలం సృష్టించేది.

అది కనపడితే పశువులు ఆగిపొయ్యేవి. అది మార్గంలో నిలబడితే బండ్లు, మనుషులు ఆగిపోయే వాళ్లు. దానంతటది వెళ్లిపోతే తప్ప ప్రజలకు కదలడానికి వీలుండేదికాదు.

ఇలా ఉండగా ఆ ఊళ్లో సంఘ నిర్మాణం జరిగి, పోరాటాలు మొదలయ్యి- పుంజుకొని, సాంఘిక బహిష్కారం- తదితర సంగతులు జరిగిన తరువాత దొరకు ఊళ్లో ఉండడం వీలుపడక పట్నం పారిపోయాడు- అదంతా అంతోయింతో విప్లవ రచయితలకు తెలుసు, నేను ప్రత్యేకంగా చెప్పవలసిందేమి లేదు.

దొర మనిషి కనుక రక్షణకోసం పారిపోయాడు.

అప్పుడు అంబోతుకు కష్టాలు ప్రారంభమయ్యాయి.

దాని ఆలనాపాలనా చూసేవాళ్లు లేక బాగా చిక్కిపోయింది. పాపం దానికి నీళ్లు త్రాగడం (తనైతాను) కూడా అనుభవంలోలేదు. అది ఇప్పుడు పంట చేలలోకి వస్తే రైతులు చేతులు జోడించి మొక్కడం లేదు. దుడ్లుమర్రేసి కొడుతున్నారు. అంబోతుకు జరిగిన మార్పు అర్థంగాక గట్టుమీద నిలబడి ఆశ్చర్యంగా చూసేది. అలా వాళ్ళంతా తరిమి కొడుతూ ఉండగా సాయంత్రం పూట పశువుల మందమీదికొస్తే పశువులుకూడా ఖాతరు చేయడంలేదు. ఎందుకంటే అది బాగా చిక్కిపోయి మిగతా పశువుల్లాగే అయిపోయింది. ఊళ్లో ఎవరూ మార్గంలో కనపడితే ఆగిపోవడం లేదు. అదిలించి పక్కకుకొట్టి దాటి పోతున్నారు.

దానికి ఏ పొలం కనబడితే ఆ పొలం మేయడం తప్ప ఇతరత్రా గడ్డి దొరికే ప్రదేశాలు, మేసే విధానం దాని జీవితంలో అనుభవం లేదు- అంబోతు గనుక గ్రామంలో వచ్చిన ప్రధానమైన మార్పు గుర్తించ లేకపోయింది.

అలా అంబోతు తిరిగి తిరిగి దొర మూసున్న గడి ముంగటికొచ్చి దీనంగా గడి తలుపులను చూసి గజగజ వణికిపోతూ వలవల కన్నీళ్లడిపి కూలబడిపోయింది. గిలగిల తన్నుకుంది- చివరకు....

కన్నుమూసింది.... అంబోతు చచ్చిపోయిందండీ!

ఆర్థికవిషయాల ఉపరితలమే మతమని ఈకథలో దేవుని సెంటిమెంటు తొలగడం చెప్పుతుంది.... భూస్వామ్య వ్యవస్థకు చివరకు సంభవించనున్న విషాద ముగింపు ఇందులోఉన్నది- ఈ కథను నా జీవితకాలమంతా రాసినా ఇంకొంత మిగిలే ఉంటుంది- ఇది ఒక యథార్థసంఘటన.

ఇలాగా ఎన్నయినా చెప్పుకోవచ్చు....

ఇప్పుడు ప్రపంచం మొత్తంమీద మానవుల జీవితాల్లో విపరీతమైన మార్పులు సంభవిస్తున్నాయి- ఎందుకంటే ఇది విప్లవాల యుగం- దేశాలు స్వాతంత్ర్యాన్ని జాతులు విముక్తిని కోరుతున్నాయి. సామ్రాజ్యవాదం మరణశయ్య మీద ఉంటే- సోషల్ సామ్రాజ్యవాదం గోతి తవ్వుకుంటోంది.

మనకు అతిదగ్గర్లోనే ఓ యాభయి మైళ్ళ దూరంలో మానవులు నెత్తురోడే శరీరాలతో, మండుతున్న గుండెలతో, మరుగుతున్న నెత్తురుతో మార్పుకోసం, మనుగడ కోసం జీవన్మరణ పోరాటాలు చేస్తున్నారు- అక్కడ జీవితం ఎన్నడులేనంత తీవ్రంగా అత్యంత వేగంగా మార్పుకు లోనవుతున్నది.

కనుక కథ, నవల జీవితంలో సంభవిస్తున్న మార్పువేగాన్ని, విప్లవగమనాన్ని అందుకోవాలని అందుకు కలం సైనికులుగా మన కర్తవ్యాన్ని మనం నెరవేర్చాలని నేను అభిప్రాయ పడుతున్నాను.

ఆఖరుగా చిక్‌మగలూరు ఎలక్షన్ సందర్భంలో ఒకజర్నలిస్టు మాటతో నేను ముగిస్తాను....

"ఈనాడు కుహనా మేధావులు తూరుపు వేపు వీపు బెట్టి ప్రపంచ మంతా చీకటేనని అరుస్తున్నారు. సిద్ధాంతాలు చేస్తున్నారు- ఇవ్వాళ్ళ నిజమైన మేధావి కరీంనగర్, ఆదిలాబాదు వేపు చూస్తాడు. కుహనా మేధావులు చిక్మగలూర్ వేపు చూస్తారు."

మేధావులారా! రచయితలారా! మీరు వెలుగు చూడాలంటే తూరుపుకు అభిముఖం కండి- ఆదిలాబాదు, కరీంనగరం జిల్లాల్లో జీవితం ఎంత వేగంగా పురోగమిస్తున్నదో గమనించండి.

విప్లవం వర్ధిల్లాలి....
విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి....

– అల్లం రాజయ్య

# II

కథకు కాళ్ళులేవు, ముంతకు చెవులు లేవు అంటారు. మన ఇతిహాసాల్లో, పురాణాల్లో, కావ్యాల్లో, ప్రబంధాల్లో బోలెడు కథలు, ఉపాఖ్యానాలూ వున్నాయి. దేశదేశాల్లోనూ పిట్టకథలకూ, నీతికథలకూ కొదవేలేదు. మన కాశీమజిలీ కథలంటే అంతా చెవికోసుకుంటారు. అయితే ఇవన్నీ అనగా అనగా కథలు. చెప్పే వారితో పాటు ఊఁ కొట్టె వారుంటేనే అవి రాణిస్తాయి. నిన్నటిని గురించి, జరిగిపోయిన వాటిని గురించి చెప్పేవవి. అలా పురాణంలా చెప్పుకుపోవాలి.

కాని నేటి కథ వేరు. ఎవరికి వారు చదువుకోవాలి. చదివే వారికే కథ ఉపయోగపడుతుంది. వర్తమానాన్ని చిత్రిస్తుంది- జీవితానికి అద్దం పడుతుంది. కేవలం నిన్నటిని చిత్రికపట్టడం కాకుండా నేటిని అభివర్ణించాలి. ఇతివృత్తం, పాత్రలు, వాతావరణం, సంఘటన ఇవన్నీ తప్పనిసరిగా వుండాలి.

బాధ కవిత్వానికి పర్యాయపదం అన్నాడు శ్రీశ్రీ. కథకు వ్యథ మూలం అనొచ్చు మనం. కథలన్నీ వాస్తవ జీవితంలోంచే పుడతాయి- పుట్టి, ఊహాలోకంలో పెరిగి పెద్దవవుతాయి. అయితే కథకీ, జీవితానికీ తేడా ఏమిటి? మిగుల పండిన పళ్ళు చెట్టు నుంచి రాలిపోతాయి అనేది నిజం. ప్రపంచంలో అలా జరుగుతుంది. మర్రిపళ్ళు రాల్తాయి- మామిడిపళ్ళు రాల్తాయి- తాటిపండ్లు కూడా రాల్తాయి అంటే అది యథార్థమే అవుతుంది. ఓ తాటిపండు రాలింది. ఓ కునుకు నక్కమీద పడింది అంటే అదో కథవుతుంది. అందుకని నిజాన్ని బాగా కనిపెట్టి అందులోని వ్యథను వెలికితీస్తే అది కథవుతుంది. రాసిన కథలకన్నా రాయని కథలే ఎక్కువ. ఆమాట కొస్తే మనలో చాలామంది రాయని భాస్కరులే. నిత్య జీవితంలో కథలకు బోలెడు ముడిసరుకుంది. తరగని గని జీవితం. అందులో ఆధునిక జీవితం మరీను. జీవితంలో లోతు కొలవలేం, వైవిధ్యం చుట్టలేం, వేగం అందుకోలేం. కథలు రాయాలనే తపన వుండాలే గాని ఇతివృత్తాలను వెదుక్కోనక్కరలేదు.

నువ్వుండే పట్నంలో పెద్ద ఆసుపత్రి- అందులో ఒకేఒక్క- అతి మంచి సూదిమందు వుంది- అదివ్వకపోతే ఓ గొప్ప పేషెంటు చస్తాడు- అదివ్వకపోతే పేద పేషెంటు చస్తాడు- ఆ ఇద్దరిలోనూ ఆ మందు ఎవరికివ్వాలి? ఎవరికిస్తారు? అందువల్ల ఫలితాలు? ఆసుపత్రులు పేదవారికోసం కడతారు- అక్కడ వసతులన్నీ పెద్దవారికి దొరుకుతాయి.

దీనిమీద కథ రాయొచ్చు.

ఎక్కడా డబ్బు పుట్టకపోతే కొంతమంది ఆసుపత్రికెళ్ళి అయిదు రూపాయిల కోసం రక్తదానం చేసేస్తారు. అంత త్యాగంచేసి ఇంటికి అయిదూ పట్టుకుపోదాం అంటే అందులో రూపాయి అక్కడి ఛోటా ఉద్యోగి లాక్కుంటాడు.

కథ కట్టవచ్చు.

అలా ఓ పేద ఆడమనిషి రక్తదానం చేసి పిల్లల కోసం ఇంటికి నాలుగు రూపాయిలూ పట్టుకెళ్ళి మొగుడి చేతికి బియ్యంకోసం మూడ్రూపాయిలిస్తే, వాడందులో రూపాయిన్నర ప్రభుత్వ సారాదుకాణానికి సమర్పయామి: అంటాడు. మిగతా రూపాయిన్నర బియ్యంలో పావలా మేరకి రాయీరప్పా చెత్తా కొట్టువాడు కలిపేస్తాడు.

కథ రాయొచ్చు.

ఆ పేద ఆడమనిషికి ఓ పదేళ్ళ కూతురుంటుంది. మిగిలిన ఆ ఒక్క రూపాయి కూతురుకిస్తుంది. మరునాడు వినాయకచవితి. పూజ్జెయ్యడానికని వినాయకుడిబొమ్మ కొనుక్కుని తిరిగొస్తుండగా ఆ పిల్లను ప్రైవేటు సిటీబస్సు గుద్దేస్తుంది. "నిన్ను పిప్పి చేసుకున్నామే కూతురా!" అని పేద దంపతులు గోడుగోడున ఏడుస్తారు. చుట్టుపక్కల జనం కోపం పట్టలేక ఆ సిటీబస్సును తగలెడతారు. విద్యార్థులు వీధుల్లోకి వస్తారు. పోలీసులు రంగప్రవేశం చేస్తారు. అరెస్టులు, లాఠీఛార్జీలు, కాల్పులు. ప్రైవేటు సిటీబస్సు యజమానుల కొమ్ముకాస్తుంది ప్రభుత్వం. కాని పోరాటం మంచి ఊపు అందుకుంటుంది. ప్రభుత్వం దిగిరాక తప్పలేదు. విద్యార్థులు, ప్రజలు విజయ భేరి మోగించారు. ఏనాటి నుంచో నెత్తురుకూడు తింటున్న ప్రైవేటు సిటీబస్సు యజమానుల ఆట కట్టింది.

మంచి కథ రాయొచ్చు.

రోజువారీ మనకు కేవలం ఆక్సిడెంట్లుగా కనిపించే వాటి వెనకాల కూడా ఆర్థిక వ్యవస్థ వికటాట్టహాసం కళ్ళకు కడుతుంది. ఉదాహరణకు ఓ సూపర్‌ఫాస్టు రైలు బాణంలా రివ్వున దూసుకు పోతోంది. ఉన్నట్టుండి ఠక్కున ఆ బండి ఆగిపోతుంది. బండి ఎందుకాగిందో ఎవరికీ తెలీదు. ఆదుర్దాగా అటూఇటూ చూస్తారు. వేగిరం వెళ్ళాలని ఆరాటపడుతుంటారు ప్రయాణీకులు. తీరా చూస్తే రైలు పట్టాలమీద తల ఒకచోట, మొండెం ఒకచోట. తెగిన కాలు, చెక్కేసిన గోళ్ళు. అంతా భీభత్సరస ప్రధానం. చనిపోయిన వ్యక్తి రైల్వే కార్మికుడు. లోకోషెడ్‌లో పనిచేస్తున్నాడు. ఆ లోకోషెడ్ ఇండియాలోకల్లా మేటిదని పేరుమోసింది. రైలుపట్టాలకు ఇవతల లోకోషెడ్. అవతల కార్మికుల ఇళ్ళు. డ్యూటీకి రావాలంటే అర్ధరాత్రి, అపరాత్రి

రైలుకమ్మలు దాటి రావాలి- ఇలాంటిచోట్ల ఓవర్ బ్రిడ్జిలు కట్టరు ఏలినవారు- కార్మికుల కనీస సౌకర్యాలు ఈ వ్యవస్థలో తీరవు- వారి ప్రాణాలకు విలువలేదు- ఆ లోకో షెడ్‌కు ఎదురుగా రైలుపట్టాలమీద రైలుకు బలయిపోతాడు. ఆ కార్మికుడు రాత్రి 2 గంటలకు డ్యూటీకి వస్తుంటే జరిగిందిది. తెల్లారేదాకా ఎన్నో రైళ్ళు ఆ కమ్మల మీదగా పోయాయి. బాగా వెలుగొచ్చాక కొందరు చూసి రైళ్ళాపారు- రైల్వే అధికారులు వచ్చి నష్టపరిహారం తేలిస్తేనేగాని రైళ్ళు కదలనివ్వమని కార్మికులు పట్టు పట్టారు- అధికారులు దిగివచ్చారు.

నవరస భరితమయిన కథ రాయొచ్చు.

ప్రతి సంఘటనను నువ్వు ఏ దృష్టినుంచి, ఏ దృక్పథంతో చూసి ఆలోచిస్తావనేది చాలా ముఖ్యం. అక్కడే రచయిత దృక్పథం తెలుస్తుంది. ఆ కార్మికుడు తప్పతాగి డ్యూటీ కొస్తుంటే రైలుకింద పడ్డాడని, అందుకని అందరూ మొరార్జీ గారిని పాటించాలని ఓ మధ్యనిషేధ ప్రచార కథ రాయొచ్చు. పేదలపక్షం వహించే రచయితలు, దగాను బట్టబయలుచేసే రచయితలకు రావిశాస్త్రిగారి 'సారా కథలు' వరవడి పెడతాయి. అందుకనే రచయితల్లో తేడాలు, రచయితల సంఘాలు వుంటాయి, వున్నాయి.

అయితే కొత్తగా కథలు రాసే వాళ్ళు తమ మనసులోవుంది చెప్పేద్దామనే ఉబలాటంతోనే కలం పడతారు. ఒకసారి ఒక ముగింపు మెరుపులాగా తట్టి కథ రాయాలనిపించవచ్చు- ఒక సంభాషణ, ఒక పాత్ర, ఒక సంఘటన కదిలిస్తే కథ రాయవచ్చు. మొదటగా కవిత్వం రాసేవాళ్ళు పదాడంబరంకోసం ఛందస్సుకోసం తాపత్రయపడినట్టే కథకులు కూడా ఇతివృత్తం జోలికిపోకుండా కథాసంవిధానంతో పాఠకులను ఆకట్టుకోవాలని చూస్తారు. అందుకని ఎక్కువగా పాత్రల చుట్టూ కథలల్లుతారు. ప్రారంభకులు ఎక్కువగా అలా చేస్తారు. ఇది మొదటి దశ.

ఈ దశ నుంచి రచయిత మరో దశకు ఎదగవలసి వుంటుంది. ఇతివృత్తం ఎంచుకోవాలి. ఎంచుకున్న ఇతివృత్తాన్నే కథావస్తువు అంటాం. ఆ వస్తువు కోసమే పాత్రలు, పాత్ర చిత్రణకోసం వాతావరణం, టెంపోకోసం సంఘటనలు, సంఘటనలకోసం పరిస్థితుల చిత్రణ ఇవన్నీ కథలోకి వస్తాయి. రచనకు టెంపో ఎంత అవసరమో డైరెక్షన్ కూడా అంతకన్నా ఎక్కువ అవసరం. ప్రయోజనం కాంక్షించే రచయిత లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుంటాడు. రచయితలచుట్టూ సమాజం, ఆ సమాజానికొక చరిత్ర, ఆ చరిత్రకొక పరిణామం, ఆ పరిణామానికొక లక్ష్యం వుంటాయి.

మంచి రచయిత మార్పును మరింత వేగవంతం చేస్తాడు. పరిణామం ఏ దిక్కుగా జరిగిందనేది కూడా చాలా ముఖ్యం. రచయితగా అతని స్థానం నిర్ణయమయేది అతని దృష్టిని, డైరెక్షన్‌నుబట్టే.

ఏ ఇతివృత్తాన్నయినా తీసుకోవచ్చును గాని అటు పాత్రలను, ఇటు సంఘటనలను నిర్వహించగలమా లేదా అని చూడాలి. మనకు తెలియని, మనకు అంతుపట్టని పాత్రలను మనం తీసుకోకూడదు. ఉదాహరణకు– బిల్లా, రంగాలు పేరుమోసిన దొంగలు. పెద్దింటి పిల్లలను పీకపిసికి చంపేశారు. దీనిమీద అయ్యో, అయ్యో కథలు రాయొచ్చు– కాని బిల్లా, రంగాల పాత్రచిత్రణ అంత తేలికకాదు. అంతుపట్టడం కష్టం. అందుకని మనకు తెలీని పాత్రలను మనం తీసుకోకూడదు. నిభాయించలేము. పల్లెటూరి జీవితాలను, పాత్రలను కళ్ళకు కడుతున్న అల్లం రాజయ్యగారు బిల్లా, రంగాల పాత్రల మనస్తత్వాన్ని ఆకళింపు చేసుకోలేరు.

రచయితకు inhibitions మడి, వెగటు, ఎబ్బెట్టు పనికిరావు. రచయిత గూడు కట్టుకుని కూర్చుంటే జీవితాన్ని గురించి అవగతం చేసుకునే అవకాశం వుండదు. అన్ని రకాల మనుషులతో కలుపుగోలుగా తిరుగుతూ వుండాలి. అప్పుడే జీవితాన్ని సన్నిహితంగా నేరుగా తెలుసుకోవడానికి వీలవుతుంది. రచయితలు నూతిలో కప్పల్లాగా, దేవాలయాల్లో గబ్బిలాల్లాగా వుండకూడదు.

రచయితలకు ముఖ్యంగా సైకాలజీ, ఫిజియాలజీ బాగాతెలియాలి. ఉన్నట్టుండి పోలీసు ఎదురవుతాడు. ఆ భయాన్ని చిత్రించాలంటే శారీరక, మానసిక రియాక్షన్స్ తెలియాలి.

ప్రభుత్వ యంత్రాంగం ఎలా నడుస్తుందో తెలియాలి. తాలూకాఫీసు, కలెక్టరాఫీసు, బాంకులు వగయిరాల గురించి కనీసం ప్రాథమిక విషయాలయినా తెలియాలి. పోస్టాఫీసులను గురించి ప్రతివారికీ తెలుసు, కాని అక్కడ ఉత్తరాలు కత్తిరిస్తారని అంటే సెన్సారు చేస్తారని ఎందరెరుగుదురు?

రచయితలకు కాలజ్ఞానం తెలియాలి. కాలజ్ఞానం అంటే పోతులూరి వీరబ్రహ్మంగారు ప్రబోధించిందికాదు సమాజంలో ఆర్థిక, రాజకీయ చరిత్రలో మార్పులు. ముఖ్యంగా పారిశ్రామిక నాగరికత తాలూకు ప్రభావంవల్ల జీవితరంగంలో వచ్చిన మార్పులు మనం ఆకళింపు చేసుకోవాలి. ఉదాహరణకు ఇటీవల ఒక కథలో పాతికేళ్ళనాడు గాస్‌స్టౌవ్ అంటుకుని వాళ్ళమ్మ చనిపోయిందని ఒక కథకుడు రాశాడు. ఇది పూర్తిగాతప్పు. ఎందుకంటే పాతికేళ్ళనాడు మన తెలుగు దేశంలో గాస్‌స్టౌవులులేవు.

ఇలాంటి అసంగతాలూ, అసందర్భాలూ రాయడంవల్ల పాఠకులకు అపనమ్మకం కలుగుతుంది. రచయితలపైన పాఠకులకు బోలెడు నమ్మకంవుంటుంది. ఆ నమ్మకాన్ని రచయితలు వమ్ముచేసుకోకూడదు. ఇలాంటి చిన్నచిన్న విషయాల్లో తప్పులు దొర్లితే ఆ తరువాత రచయితచెప్పే సందేశంపట్ల కూడా పాఠకుడు అనుమానం వెలిబుచ్చుతాడు. అలాగే పల్లెజీవితం మీద కథలు రాసేవారికి ప్రకృతి, పొలాలు, పంటలు, విత్తనాలు వీటి గురించి బాగాతెలిసుండాలి. ఇటీవల ఒక రచయిత్రి బియ్యంచెట్టు అని రాసిందట ఆ రచయిత్రికి పల్లె జీవితంలో ఓనమాలురావని వేరేరుజువెందుకు? ఎప్పుడు ఏ పంట పండుతుంది, ఏవిత్తనం ఎప్పుడు మొలకెత్తుతుంది, పొలంపనులు ఎప్పుడేంచేస్తారు వగయిరా సంగతులు మనకు తెలవాలి. అలా తెలియని పల్లెబ్రతుకుల గురించి రాయకూడదు. రాసి నవ్వులపాలు కాకూడదు. మనిషి జీవితంతో ముడిపడుతువున్న అన్నిరంగాల్లో ప్రాథమిక పరిజ్ఞానమయినా వుండాలి.

అలాగే పోరాటాలమీద, త్యాగాలమీద రాయాలనే ఆరాటం, ఉబలాటం ఇటీవల వర్ధమాన రచయితలలో కూడా కనిపిస్తోంది. కాని తపనచెందకపోతే, జ్వలించకపోతే కథ రక్తికట్టదు. ఇటీవల ఒక కథలో ఒకరు పోలీసు ఇంటరాగేషన్ గురించి రాశారు. అసలు పోలీసుస్టేషన్ ముఖం చూడకుండా, పోలీసు పద్ధతులతో ప్రాథమిక పరిచయం లేకుండా రాసి అపహాస్యంచేశారు. అలాగే మరొకరు త్యాగాన్ని గురించి కథరాశారు. తనకు పరిచయంవున్న వ్యక్తిపాత్రను తీసుకున్నా గాని, ఆవ్యక్తి దూకిన ఉద్యమం ఆనుపానులు తెలియందే వీటికి కథలో న్యాయం జరగదు. రచయితకు చిత్తశుద్ధి అవసరం. అందుకే గుండె నెత్తురులో కలంముంచి రాయమన్నారు చలం. తను సిన్సియర్‌గా జ్వలించనప్పుడు ఆ విషయం మీద కథరాయడం తన మిత్రుడికి కానుక అనుకోవచ్చు గాని, ఆ ఉద్యమానికి అది న్యాయంచేయదు.

రచయితల అనుభవం వీలయినంత పెరగాలి. మనమీద ఇతరుల ప్రభావం పడడం తప్పుకాదు, పైగా అది తప్పనిసరి కూడా. అయితే కావాలని ఎవరూ, ఎవరినీ అనుకరించకూడదు. బాగాపేరుపడ్డ రచయితల చమత్కారం, విరుపు, మెరుపు, చూపు మనం తెలుసుకోవాలి. వీటినుంచి నేర్చుకుని మనం మన రీతిలో కథకట్టాలి.

సాహిత్యంలో మూసపాత్రలు పనికిరావు. ప్రబంధనాయికలందరూ పోత పోసినట్లు ఒకే రకంగా వుంటారు. మన పాత తెలుగు నాటకాల్లో వేశ్యమాతలందరూ ఒకటే అచ్చు. అందాకా ఎందుకు? మన తెలుగు సినిమాల్లో అత్తలందరు గయ్యాళి గంపలే. హీరోలు వీరశిఖామణులే. ఎప్పు డూచిత్రునచీదరు, వారికి జ్వరంరాదు,

వాళ్ళు తలనొప్పి ఎరగరు, అలాగే విలనులందరూ దుర్మార్గులు. హీరోయిన్లలను చెర బట్టడమే వారి నిత్యకృత్యం. ఇలాంటి స్టీరియోటైపు పాత్రలు సాహిత్యంలో అభిరుచి చంపేస్తాయి. తోలుబొమ్మల లాంటి పాత్రలు, చదరంగం పావుల్లాంటి పాత్రలు, మనం ఏ గడికి దూకమంటే ఆ గడికీ దూకేపాత్రలు వీటివల్ల ప్రయోజనం లేదు. అలాగే శ్రామికులను ఆదర్శ మంచి పాత్రలుగానూ, దోపిడీదార్లను ఆదర్శ చెడ్డపాత్రలు గానూ సృష్టిస్తే ఆ సాహిత్యం పేలవంగా వుంటుంది. సాహిత్యానికి సజీవ పాత్రలే పునాది. విప్లవ సాహిత్యంలో కూడా పాత్రలు విప్లవ స్వభావానికి అనుకూలంగా ఉండడమే గాక, సజీవంగా వుండాలి. సజీవ పాత్ర చిత్రణకు రచయిత ముఖ్యంగా మూడు సంగతులు అకళింపు చేసుకోవాలి. 1. జీవితానుభవం 2. సమాజ స్వభావ పరిజ్ఞానం 3. మనుషుల వర్గస్వభావం.

జీవిత వృక్షాగ్రాన పూచే పువ్వు సాహిత్యం. పువ్వుకు పువ్వు పుట్టనట్టే పుస్త కాల నుంచి పుస్తకాలు పుట్టవు. ఒకవేళ అలా పుట్టినా అవి పుట్టకొక్కులే. జీవితాన్ని పిండి కవిత్వం రాయాలి, కాచి వడపోసి కథలు రాయాలి, రంగరించి, విస్తరించి నవల రాయాలి.

ఏ సాహిత్య ప్రక్రియ అయినా సరే, ముఖ్యంగా కథ ఎందుకు రాయవచ్చో చూద్దాం.

ఒక విషయాన్ని ప్రతిపాదించడానికి కథ రాయవచ్చు. రావిశాస్త్రిగారి పిపీలికం ఒక ఉదాహరణ. సమాజంలో కష్టజీవులున్నారు- సుఖభోగులున్నారు. "బలవంత మయిన సర్పము చలిచీమల చేతచిక్కి చావదె సుమతీ" అనే పూర్వ కవి వాక్యాన్ని వర్గసమాజానికి అన్వయించి రాశారు. అంతేగాకుండా మన వగవాడే ఒకోసారి మనకు విషయాలను బోధపరుస్తాడు. అలాగే చీమకు పామే జ్ఞానబోధ చేస్తుందిందులో.

ఒక విషయాన్ని చిత్రించడానికి కథ రాయవచ్చు. కాళీపట్నం రామారావుగారి యజ్ఞం తీసుకుందాం. 1947 తరవాత మన దేశంలో జరిగిన 'అభివృద్ధి' ముఖ్యంగా పల్లెల్లో ఎంతోవుంది. ఎన్నికలు, సమితులు, పంచాయితీలు, బడులు, వ్యాపార పంటలు, వ్యవసాయంలో పారిశ్రామికీకరణ, రోడ్లు, రహదార్లు ఒకటేమిటి? ఇదంతా యజ్ఞం అనవచ్చు. ఈ యజ్ఞం నిజస్వరూపం ఏమిటి? ఒకవైపు మారిన ఉత్పత్తి శక్తులు, కొత్తగా గద్దెకెక్కిన నల్ల దొరలు- మరోవైపు మారని ఉత్పత్తి సంబంధాలు, మరింత కుంగిపోయిన నేలతల్లి బిడ్డలు. వీటిని ఒకరకంగా యజ్ఞం ఎక్స్‌రే ఫోటోతీసింది.

ఒక విషయాన్ని వివరించడానికి కథ రాయవచ్చు. రావిశాస్త్రిగారి బల్లచెక్కను ఉదాహరణగా తీసుకోవచ్చు. కారల్‌మార్క్స్ కనిపెట్టిన 'అదనపు విలువ' అనే భావన ఇంత సూటిగా, తేటగా వివరించిన కథ మన భాషలో లేదనవచ్చు. అదనపు విలువ కొరకరాని కొయ్య, అంతుపట్టదు అని వాపోతారందరూ. కాని రావిశాస్త్రిగారి బల్లచెక్క చదివితే అదనపు విలువ అరిటిపండు వలిచి చేతిలో పెట్టినట్టు వుంటుంది.

ఒక పరిణామాన్ని తీసుకురావడానికి కథ రాయవచ్చు. సంస్కరణవాద ప్రేరణతో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఎన్నో మంచి కథలు రాశారు. మధ్య తరగతి కుటుంబాల్లో వుండే ఆచారాలను, పాతకాలపు అలవాట్లను దుయ్యబట్టారు. మధ్యతరగతివారిది ఎంత బోలు బ్రతుకో కొడవటిగంటి కుటుంబరావుగారు తన రచన లన్నిటిలో నొక్కిచెప్పారు. మధ్యతరగతిలో మార్పు వచ్చి తీరుతుందని కుటుంబ రావుగారి కథ ఏది చదివినా తెలుస్తుంది.

పాఠకుల ఆలోచనలో మార్పు తీసుకురావాలంటే ఉదాత్తంగా, హేతుబద్ధంగా ఒప్పించేదిగా రాయాలి. ఎవరయినా ఆలోచించిన మీదటే ఆచరణకు దిగుతారు. అయితే ఒకవ్యక్తిని ఆచరణకు పురికొల్పాలంటే అతని ఆవేశాలను స్పందింప జేయాలి. అందుకే ఈ కళలు, కవితలు, కథలు, నవలలు పుంఖానుపుంఖంగా రావాలి. ఆవేశ పరచ లేకపోతే కళ అనిపించుకోదు.

బాగా లీనమైపోయి ఆత్మాశ్రయంగా రాస్తాడు చలం. పరిశీలనతో నిర్లిప్తంగా రాస్తాడు కొడవటిగంటి. లీనమయ్యే పద్ధతిని, నిర్లిప్తంగా రాసే పద్ధతిని సమపాళ్ళలో మేళవించగల రచయితలు ఉప్పల లక్ష్మణరావు, పట్టికోట ఆళ్వారుస్వామి, రాచకొండ, కాశీపట్నం వగయిరాలు.

తెలుగు కవిత, కథ మనం గర్వించదగ్గ శిఖరాలనందుకుంది. నాటకం పాతా శంలో వుంది. కన్యాశుల్కం సరసన నించోగల తెలుగు నాటకం మనకు రాలేదు. నాటికీ, నేటికీ మనకు మంచి సామాజిక నవల మాలపల్లి. మనకు నవలాకారులు లేరు. ఉన్నవవారు, ఉప్పలవారు ఒకేఒక్క నవలతో ఆపేశారు. పుంఖానుపుంఖంగా నవలలు వెలువరించలేకపోయారు వారు. విశ్వనాథ నవలలు రాసినా కవిగానే నిలబడిపోయాడు. చిలకమర్తి పౌరాణిక నాటక కర్త. చలం, కొడవటిగంటి, గోపీచంద్, శ్రీపాద, మల్లాది, బుచ్చిబాబు, రాచకొండ వగయిరాలు కొన్ని కొన్ని నవలలు రాసినా సాహిత్య లోకంలో వీళ్ళందరికీ కథకులుగానే పెద్దపీటలు వేశారు. తెలుగు నవల ఎందుకు వికసించలేదు? తెలుగువారికి శరత్, ప్రేమ్‌చంద్, టాల్‌స్టాయి, గోర్కీ, డికెన్సు,

గాల్సువర్దీ, బాల్జాక్, విక్టర్ హ్యూగోలు ఎందుకు లేరు? సమాధానం దొరకని ఒక సాహిత్య ప్రశ్న. ఏ ఇద్దరు తెలుగు సాహిత్యాభిమానులు కలుసుకున్నా వాపో తుంటారు. నవలల్లో సమగ్ర జీవితచిత్రణ కావాలి.

ఒకరకంగా చూస్తే రాజకీయాలకు, తెలుగు నవలలకు రక్తసంబంధం వుంది. మాలపల్లి, అతడు-ఆమె, మహీధర రామమోహనరావుగారి నవలలు, ప్రజల మనిషి, గంగు వీటిని పేర్కొనవచ్చు. ఆ మాటకొస్తే తెలుగులో మంచి నవలలివే. వీటికి నూటికి నూరుపాళ్ళు రాజకీయ ప్రేరణ వుంది. రాజకీయాలతో దగ్గర చుట్టరికం వుంటేనే మన నేలలో మంచి నవల వికసిస్తుందేమో! అందుకే ఈ సాహిత్య ఉద్యమాలు, ఈ రచయితల సంఘాలు.

మనం పోరాటంమీద రాస్తున్నాంగాని, దగామీద రాయడంలేదు. పీడనమీద రాస్తున్నాంగాని దోపిడీమీద రాయడంలేదు. అలాగే మనం కష్టజీవుల, కార్మికులమీద రాయాలి. కేవలం మన రచనలు చాకిరీచేసే మధ్యతరగతి వాళ్ళమీదే రాస్తున్నాం. శ్రమవేరు, చాకిరీవేరు- సంఘటిత కార్మికులమీద కథలు రాసినప్పుడే దోపిడీస్వభావం మనకు కళ్ళకు కడుతుంది. అటు పల్లెల్లో, ఇటు పట్నాల్లో వ్యవసాయ కూలీలమీదా, కార్మికులమీదా రాసినప్పుడే మనకు సమాజంలో లోతు కనబడుతుంది.

స్త్రీలపై అత్యాచారాలు అంటే ధనికులు, భూస్వాములు ఆడవాళ్ళను చెరచడమే నని రాస్తున్నారు. కాని ఇది నిన్నటి ప్రభావం. ఇవాళ మార్పు వచ్చింది. స్త్రీలపై అత్యాచారాలు జరిగే రూపాలు మారిపోయాయి. ఆ మాటకొస్తే అసలు పాతివ్రత్యమే ఒక కృత్రిమ విలువ. దీనికి పునాది నాది అనే భావన. దీనికి మూలం స్వంతఆస్తి.

అలాగే వ్యభిచార గృహాల గురించి రాసేప్పుడు కేవలం వేశ్యలను కథానాయికలుగా తీసుకుని రాస్తే చాలదు. అలాంటి వారు విశ్వసాహిత్యంలో నానా, థాయిస్, మన మధురవాణిదాకా ఎందరో తారసపడతారు. కాని వ్యభిచార గృహాల వెనకాల గజ్జెకట్టి నాట్యంచేసే ఆర్థికశక్తుల చిద్విలాసాలను చిత్రించాలి. అటు విశ్వసాహిత్యంలో కుప్రిన్ రాసిన యామా, ఇటు తెలుగులో రావిశాస్త్రిగారి రత్తాలు-రాంబాబు వీటిని బాగా పసికట్టగలిగాయి.

మన దృష్టి ఎంతసేపూ పట్నాల్లోని నిరుద్యోగంమీదేవుంది. దీనిమీద చెప్పుకో దగ్గ నిరసన, పోరాటం వున్నాయి. కాలేజీలు, యూనివర్సిటీలు కార్ఖానాల్లాగా నిరుద్యోగులను సరఫరాచేస్తున్నాయి. పరిశ్రమలు ఎంత పెరిగినా నిరుద్యోగాన్ని ఆ

## ఎత్తుని పిడికిళ్ళు....

చుక్క

(గత సంచిక తరువాయి)

దసరా పండుగ అయిపోయింది.

వూరంతా ఉడికిపోతోంది.

దొర పెద్దపులి కదా! ఎవ్వని కొడ్తడో, ఎవ్వని చంపుకతింటడో....?

ఆనాటి రాత్రి....

పిల్లలు పండుకున్నరు. దీపం వెలుగుతున్నది. ఎక్కడివక్కడ గిన్నెలన్ని సదిరింది ఈరమ్మ. సిగలోంచి జారిపోతున్న బంతిపూల దండని సరిగ్గా అదిమి పెట్టింది. అయిదేళ్ళ చిన్నది ఏడుస్తున్నది. ఆమెకన్నీ తొందరే. ఆఖరికి బువ్వ కూడా సగం కడుపుకే తింటుంది. అసలు ఆ చిన్నదానితో వేగలేకుండవుంది. కానీ ఆ బిడ్డే అరక్షణం కనిపించకపోతే, తన పంచప్రాణాలెగిరిపోవూ! తను చచ్చిపోదూ!

మెల్లగ నడుచుకుంటూ వచ్చి మంచం కోడుమీన కూర్చుంది.

"ఈరా! నామీన కోపమా?" పల్కరించిండు మల్లయ్య.

"ఉహూ! నీమీనెందుకోపం? నామీన నాకే కోపం." అంది భర్తకేసి చూడకుండనె.

---

నిష్పత్తిలో పరిష్కరించలేవు. అయితే పల్లెల్లో నిరుద్యోగం ఎంతోవుంది. దీన్ని గురించిన నిరసన, పోరాటం మాత్రం లేవు. అక్కడ పొలాలు కొద్దిమంది చేతుల్లో వున్నాయి. మన వ్యవస్థకు అదే కీలకం. భూమి కేంద్రీకరణను బద్దలు కొట్టకుండా ఉత్పత్తి సంబంధాల్లో మార్పు తేకుండా ఎంత అధునాతన పద్ధతుల్లో వ్యవసాయం చేసినా, పారిశ్రామికీకరణ జరిగినా అటు ఫలసాయం పెరగదు, ఇటు నిరుద్యోగం తొలగదు.

అందువల్ల తెలుగుజాతి జీవితంతో నవల పెనవేసుకుపోవాలంటే ఈ మార్పులన్నిటిని ఆకళింపు చేసుకున్న రచయితలే రాయాలి. అప్పుడే తెలుగు సాహిత్యంలో ఏనాటినించో కొనసాగుతున్న ఈ తీరని లోటు తీరుతుంది.

కవిత, కథ స్థాయికి నాటకం, నవల రాగలిగినప్పుడే తెలుగు సాహిత్యం సర్వతోముఖంగా వికసిస్తుంది. పోరాటాల చేవను సంతరించుకుని ముందుకు దూకుతున్న విరసం రచయితలు ఈ లోటు భర్తీ చేస్తారని నమ్ముతున్నాం.

– విశాఖ విరసం యూనిట్

[ ఈ రెండు ప్రసంగాలు జనవరి 14 ఉదయం జరిగాయి ]

"ఎందుకో అసోంటి కోపం? నాకేసి చూడు- నేనేమైన తప్పుపని చేసిన్నా?" భార్య ముఖాన్ని తనకేసి తిప్పుకున్నాడు.

"నేనట్టా అన్నానేంది? అన్నీ మీదేసుకుంటవ్- నీకే సాగుతది- నా ఏడ్పు నేనేడుత్తంటె, అయ్యగార్కేమొ నవ్వులాట-" మూతి తిప్పింది.

"అబ్బా, కొంచెం మెల్లగ మాట్లాడాలెమా! ఏంది, ఏమయింది- ఎందు కేడుత్తన్నవ్- మన లచ్చి పెరిగి పెద్దదయితె దాన్లగ్గమెట్ల సెయ్యాలనా?" నవ్వాడు.

కోపంతో పంచంబించి లేవబోయింది- గట్టిగ చేయందుకున్నడు- కూర్చోక తప్పలేదు- కూర్చుంది మళ్ళ.

"లేకుంటేందయ్యా ఇదంత? నేను బయ్యంకొద్ది సత్తుంటే నీకేమో అన్నీ నవ్వులాటలే! మొన్ననేమో అట్టసేత్తివి- మల్ల యియ్యాల్లగూడ ఆ జంబికాడికి బోకుంటేందాయె? దేవుని దయకొద్ది అందరుండబట్టి అంత సుకంగ జర్గిందిగానీ...." అంది ఈరమ్మ భర్తకేసిచూస్తూ. దసరారోజు సంగతి ఆమె కళ్ళల్లో మెదులుతున్నది. జమ్మి దగ్గరికి దొర తన మనుషులకు బాగా తాగించి పంపాడు- వాళ్ళు గుతుపకట్టెలు బట్టుకొని వచ్చిన్రు, బండబూతులు తిట్టుకుంటూ- దొంను కూడా తిట్టినారు. వాళ్ళు అయిదారుగురు వుంటారు. సంగంవాళ్ళు వాళ్ళను మక్కెలిరిగేటట్టు తంతామన్నారు కాని మల్లయ్యే వద్దన్నాడు- "అల్లుగూడా మనసోంటోళ్ళే గదా! ఏదో దొర తాగిపిత్తే అర్గెదాక వాగుతరు" అని ఆపిండు.

"అదంత జర్గిపోయింది గద! మల్లిప్పుడేమాయె, ఈ నీ ఏడ్పుడు?"

"ఆఁ.... అంత జర్గిపోయింది గన్కనే ఇగ అసోంటి పన్లల్లకు బోకుమంటున్న- ఏదో ఆ దేవుడిచ్చినకాడిక్కి మనకు లేదనా? కట్టం జేసొక్కని తిన్నంతుండె. మన మానాన మనం బత్కక ఏందంట?" అంది మెల్లగ బుజ్జగిస్తున్నట్టుగ, కన్నతల్లి కొడుక్కు చెప్పినట్టుగ.

"నేనేం జేత్తున్నా పీరా? ఆ దేవుడే చెయిమంటండు జేత్తన్న!" అన్నడు వెక్కిరింపుగా.

"ఎక్కిరించుగానీ, ముందుగాల నేజెప్పింది యిన్రాదు- ఇయ్యాల్ల మన ఎంబడి వున్నోల్లంత రేపుగూడ మనెంబడే ఉంటరని నమ్మకమా? నాకేందో బయ్యంగున్నది- పూల్లోల్లు ఏమేమో అనుకుంటన్నరు- సేసిందంత మంచిగనే ఉన్నదిగనీ దొరూకుంటడా? పామాయె! పగదీసుకోడు? అంటన్రు- అల్లు అనుకునేటిది నిజమే. దొర

డబ్బున్నోడాయె- ఏం జేసినా సెల్లుద్ది- ఇగ నీ ఇట్టం ! నాకూ, నా పోరగాల్లకు ఇసమే పోత్తవో, ఏంజేత్తవో?" అన్నది ఏడ్పుగొంతుతో. నిజంగానే కళ్ళల్లో నీళ్ళునిలిచాయి. దీపం వెలుగుకు అవి మెరిసాయి.

"ఏడుత్తున్నవా; ఈరా! ఇగముందు, కూసున్నా, దొరూకుంటడనుకున్నావా? నీ పిచ్చిగానీ. నా మీనొట్టు! చూద్దాంలే మరి నువ్వోకసారి నవ్వు"

"నవ్వత గనీ పిల్లల మీనొట్టెయి."

–దేవుడూ- ఒట్టూ- అనే రెండుదయ్యాలు నిన్ను పట్టిన యనుకున్నాడు.

"అంటే – నామీన నమ్మకం లేదా?" అని అడిగాడు.

"లేకేంది? గంపెడంత !" నిండుగా నవ్వింది ఈరమ్మ-

* * *

తెల్లవారింది.

పరిజల విజయానికి గుర్తుగా సంగపోల్లు ఊరేగింపు తీస్తున్నారు.

ఎక్కడికో తొందరగా తయారవుతున్నడు దొర, ఇది చెవిలోవేశాడు కొంరడు. కొంరనికి మనుసుల ఏనుగెక్కినంత సంబరమయితున్నది.

"మాదర్‌ఛోద్ లంజకొడ్కా ! సంగపోల్లు ఊరేగింపు దీత్తున్నర్. నువ్ నా పాణం దీత్తున్నవ్. ఆల్లేడ జత్తె నాకేందిరా? అచ్చి నాకే జెప్పాల్నా!" గుడ్లురిమిండు దొర.

భయంతో వణికాడు కొంరడు. దొర చచ్చిన పేనులా అయితా డనుకున్నాడు కానీ పులిలా తనమీద అరుస్తాడనుకోలేదు. 'లంజకొడ్కా – నీకు దినాల్ దగ్గర బడ్డ'యనుకున్నాడు మనసులో.

"అరేయి కొంర ! నేనొచ్చేదాక, నువ్వాడికి బోకు- ఈడనే ఉండు. దొర్సానేం జెప్పినా చెయ్యి. సంగపోల్లు ఏమేం జేత్తే అయన్ని తెల్సుకొని యాది కుంచుకొని నాకుజెప్పాలె. నేనచ్చేదాక మాత్రం గడి గడప దాటకు ?"

"సిత్తం దొరా." నసిగిండు కొంరడు.

'బాంచన్దొర, సిత్తం–' అనేటోడు యియాల యిట్ల అంటుండేంది? అనుకున్నడు దొర. "లమ్డికొడుకు, ఈనికెక్కడ కావరం ఎక్కలేద్గద?" అనుకుంటనే మేడ దిగిండు. దొర్సానికి జెప్పిండు.

దొరది మోటార్ సైకిల్ ఫట్ ఫట్ మన్నది. అది పరుగెత్తుకు పోతుంటే దాని పొగ చిన్న మబ్బులా బుసకొడ్తున్నది.

అది కనుచూపు మేర దాటగానే హమ్మయ్య అనుకున్నాడు కొంరడు.

"పేద ప్రజల ఐక్యత వర్ధిల్లాలె."

"... దొర దౌర్జన్యాలు నశించాలె".

"రైతు కూలీ సంఘం వర్ధిల్లాలె."

సంగపోల్ల అల్లరి కొంరని చెవుల్లో పడింది. చూద్దా మని కిటికీనుంచి తొంగి చూడబోయిండు.

"అరేయి కొంరా! అమ్మగారు రమ్మంటున్నరు" దొరగారి పదేళ్ళ కొడుకు వచ్చి చెప్పాడు.

కొంరనికి కోపం వచ్చింది– ఆ పోరనిమీద, పిలిచిన దొర్సానిమీద– "దొర అటు బోంగనే దానికేం బుట్టిందో?" అనుకొన్నడు. దొర వున్నప్పుడు ఎప్పుడూ కొంరన్ని పిలువ లేదు.

పోరని వెనుక నడిచాడు, పిలిచిన దొర్సాని దగ్గరికి.

* * *

కోడికూర ఘుమఘుమ్మంటున్నది. గరం మసాలా వాసన గది అంతా నిండి పోయింది.

సీసాలు టకటక మంటున్నాయి. గ్లాసులు గలగల మంటున్నాయి. ఏదో ఘాటు వాసన ముక్కుల బెదరగొడ్తున్నది.

అతను.... తాలూకా అంతట్లోకి పెద్ద భూస్వామి. దొరలందరికీ పెద్ద. ఆ తాలూకాలో ఏ ఆపద వచ్చినా ఆదుకునేది ఆ దొరే.

"ఇగ అందరిష్టమచ్చినంత తాగున్రి. మనం మాట్లాడుకునేది శానుంది." అన్నాడు పెద్దొర. గండుపిల్లి ముఖం. నెరిసిన బట్టతల. తెల్లని ఖద్దరు బట్టలు.

"మీ పూర్నుంచి ఇగ అందరచ్చినార్రి? లే కీల్లు గూడా సంగంల గల్సినార్రి?" అడిగింది గండుపిల్లి.

"ఆ(.... అందరొచ్చిన్రను. అయినా పాపం ఆళ్ళేంజేత్తరు? జనమంత ఒక్క టయినంక? నన్ను జూసి పులింజూసినట్టుగ బయ్యపడేవాళ్ళు. నాకే తెడ్డు జూపి త్తున్నరు." అన్నడు– "మీరేమన్న అనున్రి– మీకు సాతగాదు– దద్దమ్మలు పెత్తనం

చెలాయించరాదు అనున్రి ఆ మల్లడున్నంత కాలం ఇగా వూర్లె మా కిలువ లేదు. ఆని సంగమున్నంత కాలం మేమావూర్లె బత్కుడు కష్టం!" అన్నాడు దొర.

"అగో అట్లనుకుంటె మన పెత్తనాలిగ నడ్సినట్టె! ఇగ అస్సల్ సంగతికొద్దం. అస్సలు మనమందరమిక్కడ మీటింగు ఎందుకయినమంటె, మీ వూర్లల్ల నుంచి ఇంత దూరమచ్చి ఈడ కల్సుకున్నదెందుకంటె, మీకు బుద్ధిల్లేక- పెత్తనాలెట్ల నడిపించుకో వాల్ననే తెల్విలేక- నేనంటున్నని కోపాన్కి రాకున్రి- ఇది నేను అంటలేను. ఆ మల్లదే అన్నడు- అని సంగమే అన్నది."

"మన దొరతనాలకే అడు, అని సంగం-ఎసరుపెడ్తుంటె, మీరంతా చూస్తుంట కూసున్నరంటె- మనకు బుద్ధిలేదని తెల్తనే ఉన్నది. మనకే తెలివుంటె- అడు, అని సంగం మనతోటి దొర....కు ఎదురు తిరిగి దొరతనానికే ఎసరు పెడ్తున్నరంటె, అ(.... లంజకొడుకు ఎంతకు తెగించినట్టు? అడు ఒక్క మన తోటి దొర....కే శత్రువు కాదు. దొరతానానికే శత్రువు- అంటే మనమందరం దొరలమే గాబట్టి మనందరికీ శత్రువన్న మాట- మన దాంట్ల కొందరనుకోవచ్చు- మాకు దొరతనమున్నదా అని అది పెద్దతప్పు- అట్లంటే మనందరం ఏకం కానట్టు లెక్క- ఆ సంగం లంజకొడ్కులకు సందిచ్చి నట్టయితది. పెత్తనం చెలాయించె దొరలకే జనం పంగనామాలు పెడ్తున్నరంటె ఇగ మిగిల్న దొరల బత్కు కుక్క బతుకే! అని నేనంటున్న."

"మా వూర్లె జూడున్రి, నా మాట కెదురురేదు. నేను బత్కమ్మ ఎన్నడంటె అన్నదే. అడమాత్రం సంగపోల్లు లేరా? ఉంటే ఆ లంజకొడ్కులు నా ఈక పీకినార్రి, ఇప్పుడు సూస్కపోన్రి, సంగంలుంటె ఒక్కొక్క లంజకొడ్కును జంగల్ బట్టించిన! జంగల్ బట్టించుడంటె సిన్న పనుకున్నరా? జూటా కేసులు అల్లమీన తయార్జేయించాలె. ఇగ అది సాతగాకుంటె అల్లను అస్సల్లేకుండ జెయ్యడం పెద్ద సిక్కుం గాదు...."

"ఇగ మీ వూర్లో ఒగ సంగముంది. దానిలీడరు ఎడ్డి నా గాడ్దికొడుకు. అడు జేసే ప్రతీ పన్కి – గుళ్ళో జేజల్లెక్క చూస్కుంట కూకున్నరు. నిమ్మకు నీరెత్తి నట్టున్నరు. కానీ నే సెప్తిగా మనం దొర్లమంత ఒకటి, మన దొర తనాలు సల్లం గుండాలంటె, మనండ్ల మనకెన్ని పాతపగలున్నా- మనం ఒక్కటి కావాలె. మన కులపోని బతుకు బజారుకెక్కుతుంటె సూస్కుంట కూసుంటె మంచిదా?"

"ఇంతదన్క మీ దొరతనాలు ఈ మాత్రమయినా పెత్తనం చలాయిస్తున్న యంటే జనానికి ఈయన మీదున్న బయ్యం – ఫక్తే."

"కూలినాలి జనం బక్కచిక్కుతుందంటె మనమే కారణం. ఆకు తినేది మనుష్పే, తాగేది మన గంజినీళ్ళే."

"నిన్నమొన్న మీ వూళ్లె జరిగింది విన్న తర్వాత— నా కసలు సచ్చినంత పనయ్యింది అనుకొన్రి."

"మరిగ— ఆలోచించుకోన్రి ఈయన దొరతనమే బోవాల్నని మీరనుకుంటే, మీ దొరతనాలు ఉన్నకాడికి పుస్తెల్ తెంపుకున్నట్టుగ పుటుక్కుమంటయి. ఇగ తర్వాతచ్చె మన పోరగాండ్లకు ఇసం బోసుకున్నట్టయితది!"

"ఇంతసేపు నేమాట్లాడింది యింటిరి మరిగ మీ మన్సులల్ల ఉన్నది జెప్పన్రి"

అందరు "మంచిగ మాట్లాడిన్రు" అన్నరు.

తిన్నరు – తాగిన్రు – తాగిన్రు – తిన్నరు.

"పెద్దొరకు తమవూళ్ళ సంగపోల్లు ఎదురు తిర్గుతున్నరంటె రేపిదే గొడ్డలి తమ బొండిగెల మీనికి రాదని పూచీఏంది? అందుకని ఆ గొడ్డల్ని యిప్పుడే మొండి బోద గొట్టాలె జెప్పింది నిజమే. 'దొరలకు దొరలకు ఎన్ని పగలున్నా, మద్దెలింకొకనికి సంచత్తె ఆయింత ఆడు ఏకు బోయి మేకయి కూసుంటడు! గన్క దొరలంత ఎప్పట్నీ ఒక్కటిగానె ఉండాలే, దొరతనమ్మీన గుత్ప ఎత్తేటోన్కి బుద్ధిజెప్పాలె?" అనుకున్నరు.

తిన్నది అరుగుతున్నది. మెల్లగ తాగింది కూడా అరుగుతున్నది.

* * *

సంధ్యవేళ అయింది.

"అరేయి రాజీ! మీ యవ్వచ్చినంక జెప్పు– నాయ్న వూరికి బోయిండని." కొడుక్కు జెప్పి కూతుర్ని ముద్దుబెట్టుకున్నడు మల్లయ్య.

"నేంగూడ త్తనే మల్లన్నా! ఈడుండి నేనెం జేత్తను? ఇద్దరం బోద" మన్నడు చలపతి.

"నువ్వెందుకు చలపతి? ఈడ్నే ఉండు అందర్ని కూసుండబెట్టి మాట్లాడు." ఇంకో మాట అనలేదు చలపతి. 'మంచి'దన్నట్టు తలూపాడు.

'అచ్చినంక అదినకు జెప్పు. నేను గన్నదరపోతె బయపడగిట్ల. రాత్రచ్చి ఇక్కన్నే పండుకో'మని చెప్పి కదిలాడు మల్లయ్య.

తోవలో కన్పించిన వాళ్ళందరిని పలకరిస్తూ నడుస్తున్నాడు.

వూరుదాటేసరికి మసక చీకటి అయింది.

తను పోయేది పక్కవూరికే నడిస్తె అరగంట ప్రయాణం.

"కొడ్కా మల్లయ్యా" పిలిచాడు కుమ్మరి సాయన్న. మొక్కజొన్నచేను కావలి కాస్తున్నాడు. అతని మధ్యవయస్సు భార్య చనిపోయింది. ఇద్దరు కూతుళ్ళే. పెద్దకూతురు పెళ్ళయి అత్తారింటికెళ్ళిపోయింది. మిగిలింది చిన్నకూతురే మంచి పిల్లవాడుంటే ఇల్లరికం తెచ్చుకోవాలని చూస్తున్నాడు. ఆపని మల్లయ్యకే అప్పగించాడు.

'ఏందే నాయ్నా! కంకులు బాగ్గాసినయా?" ఆగిండు మల్లయ్య.

మంచె దిగి వచ్చాడు సాయన్న, "ఏం గానుదో ఏమోరా కొడ్కా ఈ చేను సంగతి నీకు దెలుసు గదా? దొర ఈ భూమి తన దంటున్నడట. ఒకరిద్దరు జెప్పిన్రు కల్లంమీదికి కంకు లేస్కపోనత్త నన్నడట, మరి నా రెక్కలు ముక్కలాయె- అడేమొ గట్టనవట్టె ఎట్టరా ?

"అని ఎవ్వడన్నడే? దొర అన్నడని ఎవ్వడో జెప్తె మన మెగుర్దామా ? రానీ, కల్లం మీదికి అచ్చినపుడే ఆని పని బెడ్తం. మేమందరముండంగ ఇంక నీకేం బయ్యమే ?" అన్నడు మల్లయ్య.

"నాకేం బయ్యంరా? తెల్సినోనివి నీకు జెప్పకుంటే ఇంకెవ్వలకు జెప్పుకుంట? సరెగని యాడిదాక బోతున్నవురా !"

"ఇగో పక్కూరికి బోతన్ననే-" కదిలిండు మల్లయ్య.

"సీకటి పడతాంది, జెప్పన బో బిడ్డా!"

చేనులు దాటిండు.

ఈ వూరికి పక్క వూరికి పోయే తోవ చింత తోపుల్లో నుంచి పోతుంది. చింతలతోపు దాటితే చేన్లమధ్య మైలు దూరం నడిస్తే పక్కవూరు చేరుకోవచ్చు.

కిర్రుచెప్పులు సప్పుడు చేస్తున్నయి. చేతిలో గుప్పకట్టె భూమ్మీద వేసినప్పుడల్లా సవ్వడి చేస్తున్నది.

గాలి వీస్తున్నది- కీచురాళ్ళు అరుస్తున్నాయి. చెలకల్లో కప్పలు బెకబెక మంటున్నాయి.

చింతచెట్లలోకి వచ్చాడు మల్లయ్య.

చంద్రుడు అప్పుడే మొగులు మీదికి వచ్చాడు.

ఒక్క తోవే కనబడుతోంది.

ఎవ్వరో ముగ్గురు ఎదురుగ వస్తున్నారు. ఒక్కొక్కరిది కండలు తిరిగిన శరీరం. చేతుల్లో గుత్ప కట్టెలున్నాయి.

వాళ్ళను చూడగానే మల్లయ్య పిడికిలి బిగుసుకున్నది. గుత్ప కట్టెను చెయ్యి నిండా అమిరిచ్చుకున్నాడు.

"అన్నా ! వూరు ఇంకెంతదూరం ?" వాళ్ళలో ఒకడు అడిగాడు.

"అగో కన్పిస్తాంది- ఇంతకు, మీదేవూరు ? ఏం పనికి బోతున్నరు?"

ఏదో వూరుపేరు చెప్పారు వాళ్ళు "సంగపోల్ల దగ్గర్కి బోతున్నం. సంగం పెద్ద మల్లయ్యట- ఆయన్తోటి మాట్లాడాలె- మా వూర్లె గూడా సంగం బెడ్తామని ఉన్నది. లంజకొడుక్కులు ఆ దొరల్తోటి బత్కలేకుంటున్నం" అన్నాడు ఒకడు.

"అట్లనా ? నమస్తె, నేనే మల్లయ్యను. తొందర పనుండి పక్కూరికి బోతున్నా, మీరు వూళ్ళెకు బోయి సంగంకు బోండ్రి."

"అట్లాగే మల్లన్నా, మరి నువ్వు జల్దిరావాలె." దండం పెట్టారు.

"మంచిది" రెండు అడుగులు వేసాడు మల్లయ్య- అంతే.

తలమీద ఏదో బలంగా పడింది. అది తనకు తెలుసు గుత్ప కట్టెదెబ్బ- లంజకొడుకులు నమ్మిచ్చి.... ఎక్కడెబ్బ తీస్త్రను- మసక చీకటి. కండ్లు చీకట్లు కమ్మినయ్. చేతిలోవున్న గుత్పకట్టెను గుడ్డిగా, బలంగా గిరగిరా తిప్పాడు మల్లయ్య.

"అబ్బ !.... సత్తిన్రా" అరిచాడు ఒకడు.

ఆ వెనుకే మల్లయ్య తల మరిన్ని దెబ్బలు బలంగా పడ్డాయి.... కింద పడ్డాడు మల్లయ్య.

* * *

వూర్లె కోడిగూసింది.

పాలు పితికే వాళ్ళు లేస్తున్నారు.

ఇంకా తెల్లవారలేదు.

మల్లయ్య చనిపోయాడు- కాదు, చంపేసారు అన్నవార్త సుడిగాలిలా సుళ్ళు తిరిగిపోతున్నది వార్త ఒకరి ను చి ఒకరికీ.

ఉన్న ఊరంత గడి ముందరకు వచ్చి ఆగింది. జనంలో గుసగుసలు ముచ్చట్లు.

'అరేయి ! మన మల్లన్న గీడెందుకు సచ్చిపోతడ్రా ? గీడేం పనున్నదని గీడికత్తడు? నిన్నపొద్దూకే జాముల పక్కూరికి బోతనన్నడు. ఇదంత ఆ లంజకొడుకు

దొర పనే అయ్యుంటుంది. ఆనక్కాన్ కుక్కలడుగ. నీ యక్క ! నీ యవ్వ ! గడిలకుబోయి అర్సుకుందం రాన్రి అని సంగతేందో!" అరిచాడు ఓదెలు.

అతని అంగీలేని ఛాతి ఎగురుతున్నది- కళ్ళలో నుండి అగ్ని కురుస్తున్నది.

చలపతి కేటూ తోచడం లేదు. అతని మెదడు పని చేయడం లేదు. శవం దగ్గర కూచున్నాడు. మల్లయ్యనే పరీక్షగ చూస్తున్నాడు. తలమీద బలంగా దెబ్బలు తగలవచ్చు- తలంతా రక్తం, శవం బోర్లబొక్కల ఉన్నది. దొర మేడమీద కిటికీ అద్దాలు పగిలి వున్నయ్. ఇంతవరకు ఓదెలు పెట్టిన కేకలే చెవుల్లో గింగురుమంటున్నాయి.

"మల్లన్న వూరికి బోతనన్నోడు- గీడికెందు కచ్చిండు? కిటికీ అద్దాలెందుకు పగిల్నయ్? ఓయాల్ల మల్లన్న బంగ్లమీనికెలి దున్కిండా? దున్కితే నెత్తిమీద దెబ్బ లెందుకు తగిల్నయ్?" ఆలోచిస్తనే ఉన్నాడు.

ఈరమ్మ భర్తమీదపడి ఏడుస్తోంది గుండెలవిసేటట్టు.

లస్మమ్మ పిల్ల లిద్దరిని పట్టుకుండి- ఈరమ్మ దగ్గరే కూచున్నది. పిల్లలు చంటివాళ్ళు, వాళ్ళకేం తెలుసుగానీ, తల్లి ఏడుస్తుంటే వాళ్ళుకూడా ఏడవసాగారు.

ఓదేలన్న మాటలకు అందరు చేతులెత్తారు. అందరు గడీలకు పోయారు దొరను బండబూతులు తిట్టుకుంటూ. గడీలో ఎవ్వరూలేరు. తలుపులతాళాలు పలగ్గొట్టారు- యిల్లంతా వెతికారు- ఏవి దొరికితె అవి లేవట్టి ఎత్తేసారు, విరగ్గొట్టారు. దొరమీది కసినంతా వాళ్ళు ఆ విధంగా తీర్చుకున్నారు.

శవం దగ్గరికి వచ్చిన కొంరని చలపతి అడిగాడు.

"కొంరన్నా! రాత్రి నువ్వేడున్నవ్? గడీలుంటె, ఏమన్న లొల్లిగిట్ల యిన చ్చిందా?" అడిగిండు చలపతి.

"చలపతన్నా! రాత్రి నేం గడీల్నె బన్న. ఏసోంటి లొల్లి ఇన్పియ్య లేదనీ- పుబ్బుల మూలసుక్క- బొడ్వకముందు దొరలేసి బండి తయారు జెయ్యమన్నడు- యీడుంటె నేం బతకనరి కొంరిగా నా అదృట్టం బాగుండబట్టి నేంబత్కిగాని- అన్నడు. దొర, దొర్సాని, కొడ్కు, బండితోలె రామయ్యతాత ఎల్లిపోయిన్రు-" కొంరడు చెప్పాడు.

*　　　*　　　*

పోలీసు స్టేషన్, కుర్సీలో దొర.

"ఏందో ఇంత పొద్దాల్నె- అచ్చినరి దొరగరు. చాలాకాల దర్సనం మాతోని పనిబడ్డదా ఏంది?" పరామర్శించాడు అమీన్‌సాబు.

"ఏంలేదు.... చాలా పెద్దకేసు-" చెప్పటానికి వెనకాముందూ చేసాడు దొర.

"ఏమో ఎన్కముందు జేత్తన్నరు? సెప్పండి."

"రాత్రి పన్నెండు గంటల్దాటింది. నడిజాం రాత్రి దాటిందన్నమాట, ఎవడో కిటికిలనుంచి దున్కిండు. అదివారకు నేనింక నిద్రబోలేదు. జెప్పసలేసి లైటేసిన. అడు మల్లయ్య మొకం జెప్పనేర్పాటు జెయ్యరాకుంట, మొకానికి పంచెగట్టుకున్నాడు గని, అదెట్లున్నా నేనేర్పాటు జేత్త! అడు నన్ను జంపుటానికొచ్చిండని బయ్యపడ్డ గట్టిగ అరిసిన ఎవ్వలన్న అత్తరేమోనని, ఎవ్వలత్తరు? వూరంత అనికే మద్దతాయె! అకర్కి నా ఇంటి పని మనిషి కూడ ఇగ నేను అర్వంగనె అడు నన్ను బండబూతులు తిట్టుకుంట ఒక్కతన్ను దన్నిండు. అయింత నేనెల్లల్కలబడ్డ సూదుమ్రి మోసెయ్యకి మంచం కోడు దాకింది. అయింత అప్పట్కి నా దొర్సాని కూడాలేసి గట్టిగర్సేసత్కి, లంజకొడుకు దానినోరు మూసిండు. ఇగ నాకు కోపమాగలే వాని బొండిగె దొర్కిచ్చు కొని పిస్కబోయిన, లంజకొడుకు నా కడ్పుల బలంగ గుద్దిండు. అబ్బా:– ఇప్పట్కి కడ్పుల పేగులు లుంగజుట్టుకుంటున్నయి" కడుపు పట్టుకున్నాడు. "అయింత వాడు కిటికీలనుంచి కిందికి దూకిండు. బంగ్లమీనికెలి దుంకెటప్పటికి.... లంజకొడ్కు అడి దాద్నె సచ్చిండు. సంగపోల్లు నన్నేమన్న జేత్తరని బయపడి మీ దగ్గరికచ్చిన" అమీన్‌సాబ్ చేతులు పట్టుకున్నాడు.

అమీన్‌సాబు అంతా రాసుకున్నాడు.

"సరే? మీకేం బయ్యం లేదు–"

పోలీసాయనకు చెప్పాడు, జీపు తయారుచేయమని "మీ వూర్కిబోతున్న-పంచనామ జేస్కోని రావద్దా. అడ మీ మన్సులు ఎవ్వలన్న వున్నరా?"

ఇప్పుడు ఆ వూళ్లో పోలీసు క్యాంప్ వున్నది.

ఆ వూళ్ళోకి ఎవరొచ్చినా వూరు నుంచి ఎవరు బయటకు బోయినా, ముఖ్యంగా యువకులను, ప్రశ్నలతో వేధించి, చిత్రహింసలు పెడుతూ రోజుల తరబడి అక్రమ నిర్బంధంలో వుంచుతున్నారు– వూరు అట్టుడికినట్టు వుడికిపోతుంది.

యింత జరుగుతున్నా వూర్లో మారుమూల గుడిసెల్లో రాత్రుళ్ళు ఏదో సంచలనం ఎవరో ఎవరినో కలుకొని పోతున్నట్టున్నారు, వున్నట్టుండి ఒకనాడు తెల్లవారుజామున పోలీస్ క్యాంప్‌లో కలకలం– వూరు నిండా ఎవరో ఎర్రని పోస్టర్లను అంటించారట, కరపత్రాలూ పంచారట.

"అన్నలూ, చెల్లెళ్ళూ! అధైర్య పడకండి. కలిసికట్టుగా నడవండి ఎత్తండి పిడికిళ్ళు, పోరాటం ఆగదు–" ఇది ఆ కరపత్రాల సారాంశం.

(అయిపోయింది)

# ఎవ్వడు వాడెవ్వడు?

(దప్పు డాన్స)

అల్లం వీరయ్య

పొరుకపోడు గొట్టి
మరి రాళ్లరప్పలేరి
బంజేరు దున్నిదోకి
తెల్లజొన్న వోసుకుంటె
ఎవ్వడు వాడెవ్వడు? నాదియనేటోడు
ఎవ్వడువాడెవ్వడు? నాభూమి
అనేటోడు ॥ఎవ్వడు॥

ఎండల్ల వానల్ల
బురదల్ల బుగ్గిల్ల
మన్నుబుక్కి మన్నుదిని
మన్నులోన గలిసిపోయి
మడిసెక్కలు పలుగదున్ని
అరినాటు ఏసుకుంటె
ఎవ్వడు వాడెవ్వడు? నాది అనేటోడు
ఎవ్వడువాడెవ్వడు? నాపొలం
అనేటోడు ॥ఎవ్వడు॥

ఒడ్డు ఒడ్డు నొరిగి
మరి కోతలెల్ల గోసి
మెదనరాలు గుంజంగ
మరికట్ట గట్టి మోసి
పంజగొట్టి కుప్పవోత్తే
బండ్లమీన నింపుకెల్లె
ఎవ్వడు వాడెవ్వడు నాది అనేటోడు
ఎవ్వడువాడెవ్వడు నాపంట
అనేటోడు ॥ఎవ్వడు॥

డొక్కలెండుతున్నా
మరి బండబండ గొట్టి
బురదదొక్కి బురదపిసిగి
ఇటిక జేసి కాల్చి
బండమీన బండబెట్టి
మిద్దెలు మేడలుగడితె
ఎవ్వడు వాడెవ్వడు నాది అనేటోడు
ఎవ్వడు వాడెవ్వడు నాఇల్లు
అనేటోడు ॥ఎవ్వడు॥

వాడెవడో గాదురన్నా। మనఊరి
దొరోడన్నా
వాడె వాడెరన్నా। నిలువెల్ల దోసెనన్నా!
నిలువెల్ల దోసెనన్న- నినుముంచి
పెరిగెరన్నా।
భూమి గుంజు కున్నాడు
నీబలం దోసుకున్నాడు
నీబతుకు దోసుకున్నాడు
నీఇల్లు దోసుకున్నాడు
గీ పల్లెదోసుకున్నాడు
వాడెవాడెరన్నా మన ఊరి దొరోడన్నా।
వాడెవాడెరన్నా
నిలువెల్ల దోసెనన్నా। ॥వాడె॥

రండిరండిరన్నా
మరి కదిలి రండిరన్నా
గీబతుకు మరేదారి
మనమంత ఎతుకులాడి
కీలెరిగి వాతబెట్టి
కలిసిబతుకుదాం రండి-
వాడెవడో గాదురన్నా
మనఊరిదొరోడన్నా
వాడెవాడెరన్నా
నిలువెల్ల దోసెనన్నా! ॥వాడె॥

గ లొత్తునూరులన్నా
గ రామయ్యపల్లెలన్నా
గ మడిపెల్లిలన్నా !
గ మందమర్రిలన్నా !
గ మద్దునూరులన్నా !
గ రాపల్లెలన్నా !
అక్కడిక్కడనియేంది

ఊరుఊరు పల్లెపల్లె
కదంతొక్కి కదిలిసాగి
దొరల తరిమి కొట్టిరాట
రండిరండి అన్నలు
మరికదిలి రండిఅన్నలు
కదిలిరండి అన్నలు
మరి కలిసిపోదాం అన్నలూ....

---

## లెల్లె....

(డప్పు డాన్స్)

కిరణ్

లెల్లే లెల్లె లెల్లాయిలో
లెల్లే లెల్లె లెల్లాయిలో
ఎయ్యా ఎయ్యా లెల్లాయిలో
సిరాగి గొట్టా ,,
సిటికెన పుల్లాగొట్టు ,,
పేగులు దీకి ,,
గజ్జెలు గట్టు ,,
సెర్మం దీసి ,,
దప్పొ ముడువు ,,
అడుగూ గలుపూ ,,
ఆరె ! దరువు గలుపూ ,,
లెల్లే లెల్లె లెల్లాయిలో
లెల్లే లెల్లె లెల్లాయిలో....

గొడ్ల పెండదీసి లెల్లాయిలో
గొడ్ల మేపినం ,,
బర్ల పెయిలు గడిగి ,,
బర్ల మేపినం ,,
పసుల మేపినాము ,,
పాలు బిండినాము ,,
మట్టి బెడ్డలుదిని ,,
మళ్ళు దున్నినం ,,
పొట్టి కడుపుతోని ,,
ఒడ్లు జెక్కినాము ,,
బురదల మునిగి ,,
కయిలి జేసినం ,, ॥లెల్లె॥

కడుపులు గట్టుక లెల్లాయిలో
సెల్లు తవ్వినం ,,
బొచ్చె లెండంగ ,,
బాయిలు దవ్వినం ,,
కాళ్ళు గుంజంగ ,,
మోటలు గొట్టినం ,,
బంగరు పంటలూ ,,
బత్తాలు నింపినం ,,
కడుపు కట్టుకొని ,,
గరిసెల్లు నింపినం ,,
మూతి కట్టుకొని ,,
మూటలు మోసినం ,,
గుండె నెత్తురంత ,,
గుమ్మలు నింపినం ,, ॥లెల్లె॥

దంగులు గొట్టి లెల్లాయిలో
బంగుళాలు గట్టినం ,,
సేతులు నరికి ,,
తలుపులు జేసినం ,,
నగాలు దీకి ,,
గొళ్లాలు సేసినం ,,

లెల్లె....

నెత్తురు దీసి ,,
రంగు లేసినం ,, ॥లెల్లే॥

బంగళమీన లెల్లాయిలో
అడు కొలువుదీరినడు ,,
సవరాజ్జెమని ,,
సాకు జెప్పినడు ,,
కడుపు మసిలినది ,,
కండ్లు మండినయ్ ,,
కామోషన్నడు ,,
అడు కానూన్లన్నడు ,,
కడుపుడికినది ,,
కారణమడిగితె ,,
శాంతి యన్నాడు ,,

పాలుజెప్పినడు లెల్లాయిలో
అందరొక్కటయి ,,
పనులు బందుబెడ్తె ,,
జమెదారన్నడు ,,
వాడు జేల్లబెట్టిండు ,, ॥లెల్లె॥

తిని కూసుండి లెల్లాయిలో
తీకునాలు దీసిండు ,,
కడుపుల మంటలు ,,
అరె! మొగులేముట్టె ,,
కల్లోల మన్నడు ,,
వాడు గంతులేసిండు ,,
సవరాజ్జెమిది ,,
సావురాజ్జెమిది ,,
దొంగల రాజ్జెం ,,
దొరల రాజ్జెమిది ,, ॥లెల్లె॥

అట్టలు గట్టిన లెల్లాయిలో
అరిసేకులున్నయి ,,
అరె మండే కండ్లు ,,
దీటీలయినయ్ ,,
అరె వనికే కాళ్ల ,,
ముందుకు నడిసినయ్ ,,
మండే గుండెలు ,,
కొలుములైనయ్ ,,
దోసిన కట్టం ,,
బాటసూపినది ,,

ఎయ్యఎయ్యా లెల్లాయిలో
అడుగూగలుపూ ,,
దరువూ గలుపూ ,,
లెల్లెలెల్లె లెల్లాయిలో
లెల్లెలెల్లె లెల్లాయిలో....

---

## తెలంగాణ పోరాటం

ఎ. ఎస్.

(వాడ కదిలిందిరా జంబాయిరే బెజ్జవాడ కదిలిందిరా జంబాయిరే.... అనే జముకుల పాట బాణీలో పాడుకోవాలి.)

ఎర్ర దండు కదిలిందిరా జంబాయిరే
కూలి గుండె రగిలిందిరా ,,
జగిత్యాల కదిలింది ,,
ఊరూరు మండింది ,,

తాతలనాటి నుంచి– తన్నులూ గుద్దులే–
తలెముంత గంజికి– తంగెళ్ల బీకిండ్లు
దొరల గడీలల్ల– రెక్కల్ల కష్టమూ
దొరల సెప్పులకింద– పేదోళ్ల బతుకులు
ఊరు కదిలిందిరా జంబాయిరే
మద్దునూరు కదిలిందిరా
జంబాయిరే ॥ఎర్ర॥

ఉప్పు మడిగెలోన- ఉప్పెనేలేచింది
లొత్తునూరులోన- కత్తులే మెరిసినయ్-
రాడికల్ సంఘంల- రాటు దేలినారు
దోపిడి దొరలకు- అగ్గిసీళ్లబందు
కొర మీసాలోల్లు జంబాయిరే-
పట్నాలు బట్టిండ్లు జంబాయిరే ॥ఎర్ర॥

కన్నపురంలోన- పోశన్న నెత్తురు
తిమ్మాపూరులోన- లచ్చిరాజన్నలూ-
పచ్చినెత్తురుదాగే- దొరలు గుండాగాళ్లు
పానాలుదీసినా- పోరాటమాగలే-
ఎర్రటి నెత్తుర్ల జంబాయిరే-
పోరు మొలకల్లేసే జంబాయిరే ॥ఎర్ర॥

జైత్ర యాత్ర కొరకు-
జగిత్యాల రైతులు
ఎర్రటి జండల్తో- మండేటి గుండెల్తో
బజాట్ల కచ్చిండ్లు- బరిగీసి నిల్చిండ్లు
అదిజూసి శత్రుపుకు-
గుండె కదలిపాయె
కపట నాయకులంత జంబాయిరే
కల్లోల మన్నారు జంబాయిరే ॥ఎర్ర॥

మంథెన పెద్దపల్లి- సిరిసిల్ల కోరుట్ల
బంజేరు భూముల్ల- ఎర్రజండాలెగిరే
సంఘాలు బలపడే- కంచుకోటలాయె
మడిపెల్లి పాలేర్లు- మంటలై మండిండ్లు
నగరా మోగిందిరా జంబాయిరే
కరీంనగర్ గదిలిందిరా
జంబాయిరే ॥ఎర్ర॥

తిరుగుబాటు నెల్ల- అనిచిపారే త్తపని
దొరల నమ్మినబంట్లు- చట్టాలు చేసిన
గుమ్మలాపూరోల్లు- గుండ్లకెదురునిలిచె
దట్నారు రైతులు- దండగా నిలబడి
పోరాట మాగదని జంబాయిరే-
బాట సూపిండ్లురా జంబాయిరే ॥ఎర్ర॥

పేట గదిలిందిరా జంబాయిరే
లస్నెట్టిపేట సాగిందిరా జంబాయిరే-
దొరల గడీముందు- బాంచోడు నిలబడు
దొంల భూముల్లల్ల- వజ్రాలు పండించు
దొరల గాదెలనిండ- మావోల్ల నెత్తురే
అదిలించి బెదిరించి-
ఎన్నాండ్లు దోసేరు ॥పేట॥

రాపల్లె పటేండ్లు- కన్నెర్ర జేసిండ్లు-
పోలీసుమూకలు- పిలువకుంటచ్చిండ్లు-
పటేండ్లు పోలీసు- పల్లెంత అంగడి
మర్రిబడ్డూరోల్లు- మేటుగా నిలిచిండ్లు
ఇల్లిల్లు రగిలిందిరా జంబాయిరే
రాపల్లె రగిలిందిరా జంబాయిరే ॥ఎర్ర॥

దొరల కామానికి- రాజేశ్వరి బలి
వాళ్ల కావలికొరకు- పోలీసు సర్కారు
ఆడోల్లు లేచిండ్లు- కోపానికచ్చిండ్లు
తూటాలు పేలినా- కోటయ్యె నిలిచిండ్లు.
లొల్లి లేచిందిరా జంబాయిరే
బెల్లంపెల్లి పూసిందిరా
జంబాయిరే ॥ఎర్ర॥

కొండ కోనల్లోన- గొండోల్లు లేచిండ్లు
కొండ సిలువలబట్టి- కోరలే పీకిండ్లు
పొర్కలసారుతోగల్సి- పోరాడ నేర్పిండ్లు
వడ్డీ వ్యాపారుల- గుండెల్ల మండేరు
బాధ కలిగిందిరా జంబాయిరే
అసిఫాబాద కదిలిందిరా జంబాయిరే
అడివి మండిందిరా జంబాయిరే
అదిలాబాదు మండిందిరా
జంబాయిరే ॥ఎర్ర॥

పేదోల్ల పేరుతో- పెద్దోల్ల పట్టున్న
జండపేరుజెప్పె- గుండ పార్టీగాళ్ల
ఎండ గట్టినోళ్లు- రాడికల్లే వాళ్లు
జనం పోరుతోగల్సి- నిలిచిపోయినారు
సర్కారు బంటుకు జంబాయిరే
సమధాన మిచ్చిండ్లు జంబాయిరే ॥ఎర్ర॥

అమరుడు కామ్రేడు- జనార్దన్ పేరుతో
గౌరెల్లికుంటలమల్ల- ఊరువొందిచ్చిండ్లు
నల్లబెల్లిపోరు- నాట్లతో మొదలయ్యె
లంబాడి తండల్ల- లడాయి మొదలయ్యె
గల్లి గదిలిందిరా జంబాయిరే
వరంగల్లు గదిలిందిరా జంబాయిరే
పల్లెగదిలిందిరా జంబాయిరే
పైడిపల్లె గదిలిందిరా జంబాయిరే ॥ఎర్ర॥

సమ్మెతో మొదలయిన- రైతుకూలీలంత
సమ్మె విజయాలతో- సంఘటిత పడ్డారు
తూర్పు గాలంతాను- వాలుగానే ఉంది
ఖమ్మము చరిత్ర- కాంతిబాటలవైపు
మెట్టు గదిలిందిరా జంబాయిరే
ఖమ్మం మెట్టు గదిలిందిరా
జంబాయిరే ॥ఎర్ర॥

"చిరుపర్తి" ఊరులో- చిచ్చురేగిందాట
నాటి నల్లగొండ- నైజాము గుండెదడ
నాటి పోరాటంల- రాటుదేలినోళ్లు
ఊరూర సభలకు- జేజేలు గొడుతండ్లు
కొండ కదిలిందిరా జంబాయిరే
నల్లగొండ కదిలిందిరా
జంబాయిరే ॥ఎర్ర॥

ఎన్నాళ్లు ఎన్నేండ్లు- బాంచెబతుకులతోటి
అనిగిమనిగిఉంటె- దొరలె సంపూతాండ్లు
బతికి ఉన్నరోజు- సత్తనే ఉన్నవు
బతుకు పోరాటంల- పోయేదేమి లేదు
బతికినా సచ్చినా జంబాయిరే
రణం మాటడువకు జంబాయిరే ॥ఎర్ర॥

మేటి తెలంగాణ- రణరంగమీనేల
పోరు సల్పినోళ్లు- నేలనింకిపోయిరి
రైతురాజ్యం కొరకు- మనవీరులొరిగిండ్లు
ఎంద రొరిగిన గాని- పోరాటమాగలే-
చిచ్చు రగిలిందోయి- దీటీలు మండించు
నిల్చి పోరాడితే జంబాయిరే
మారేను మన బతుకు జంబాయిరే

---

నవల - సీరియల్

# కొలిమంటుకున్నది

అల్లం రాజయ్య

(గత సంచిక తరువాయి)

## 8

ఓ దినం కను సీకటయినంక నర్సింహం అదినె కొడుకు సిన్నోడు దిగిండు- ముట్టిచ్చిన దీపం దిగుట్లెపెడ్తున్న మల్లికాంబ అక్క-కొడుకును జూసి ఎదురచ్చింది.

"ఓరినాయినో ఎంతపెద్దోనివై పోయినావురో! ఎప్పుడో మాసత్తెవంత ఉండంగ సూసిన...." కొడుకును అలాయి బలాయి తీసుకున్నది- కాళ్లనుంచి నెత్తిదాక తడిమి సూసింది- సెంపలు పునికింది.

మంచాల కూకున్న నర్సింహంసుత లేసి కొడుకు దాకచ్చి-

"సెత్తైత్తు కొడుకత్తె అకిట్లనే నిలబెట్టినవ్- కాల్లకు నీల్లియ్యవే-" అన్నడు.

"అన్నగో- మరి నాకేమి దెచ్చినవ్‌రో-" సత్తెమ్మ ఎడంసెయ్యి పట్టుకున్నది.

"కాత్తోన్న ఏంది? నీల్లుగీల్లు- అంపులు జూయించవే సిన్ని ఎన్ని దినాలయ్యిందో పెయిమీన నీల్లు బోసుకోని" అన్నడు సిన్నోడు.

సిన్నోని పేరు సెంద్రియ్య- సెంద్రియ్య ముఖమంత అలిసిపోయున్నది. కట్టుకున్న దొడ్డుదోతి బాగా మాసిపోయున్నది. తొడుక్కున్న బనీను బుజాలమీన సినిగున్నది. కాల్లకు అరిసేయి మందం దుబ్బున్నది.

సెల్లె సత్తెమ్మ సెయ్యిడువలేదు.

"నేను సాన దూరం నుంచత్తన్ననే సెల్లె- ఈపారచ్చినప్పుడు ఏదన్న తెత్త లేయే-" అన్నడు గద్దువ పట్టుకోని బతిలాడి.

"ఇడువవే పిల్లా- అడే ఆడబడీడబడి అత్తండు-" మల్లికాంబ కసిరింది.

"దానికేమెరుక పసిపోరి" అన్నడు నర్సింహం మల్ల మంచంల కూలబడుకుంట.

"గడిసేపు ఆగరాదు కొడుకా! సిడెంల సలసల నీల్లు కాగబెడ్త" అన్నది మల్లికాంబ.

కాగుడు గీగుడెందుకే సిన్ని- సన్నీల్లె పోసుకుంట- ఇయ్యాల్లంటె నువ్వ కాగబెడతవ్- రేపో...."

"అదెరా కోడలురాదు- ఇగ ఏన్నన్న సూసి సేసుకోరాదు."

"పేసుకున్నోల్లంత సుఖపడిపోతంద్రు, ఇగ నేం సుఖపడ్త- నాకెందుకే పెండ్లి.... నాకు నేను బతికేదే బమ్మ కట్టమున్నది- మజ్జెన పెండ్లాన్ని, పోరగాండ్ల ఎట్ల సాదాలె?" అని ఇంట్లకు నడిసిండు.

అంపుల కాడికి తీసుకపోయి పెంబుతోని పెయిమీన నీల్లుబోసింది- ఎన్ను రాసింది.

"నువ్వుబోపే" అని నీల్లకాగు మీన కుమ్మరిచ్చుకున్నడు.

"పేతిరందే కొడుకుంటే గీ ఏల్లల ఎంత మంచిగుండు- ఒక్క రెక్కయి పోయింది- ఎనుకాముందు ఎవలు లేకుంటయిపోయింది- సత్తి అన్న మొగపోరడు కాకపాయె...." నర్సింహం కొర్రాయితోటి సుట్ట అంటిచ్చుకుంట అనుకున్నడు.

పెంద్రయ్య ఇంటెనక సత్తెమ్మతోని బాతఖాని సేత్తండు- మల్లికాంబ బియ్యా నికి ఎవలింటికో పోయింది. కుడిసేపటికి కొంగుసాటుకు సోడన్ని బియ్యం సేబదులు తెచ్చింది. పొయ్యిమీనేసి తుకతుక ఉడికిచ్చింది.

బువ్వలు దినేకాడ అందరి కంచాలల్ల మక్క గడుక సూసి పెంద్రియ్య నొచ్చు కున్నడు.

"పరాయి మనిషి తీర్గ సేత్తన్నవ్ సిన్ని- మీరంత గటుక తినంగ లేంది నాకే మచ్చిందే? మనూల్లల్ల గీ గడుక సుత దొరుకుడు గగనమైపోయింది- పండిచ్చేది మనం తినేది ఇంకోల్లు-" అనుకుంటనే అన్న తలెకెల్లి మిడిగుడ్లేసుకొని సూత్తన్న సత్తెమ్మ గిన్నెల అరన్నం పెట్టి గడుక తీసుకున్నడు- నర్సింహం తలెలింత ఏసిండు.

"రాక రాకచ్చినవు గదరా!" నర్సింహం.

"సిన్ని! నువ్వు సుత గిన్నె తెచ్చుకో."

"మీరు తిన్నంక తింట కొడుకా!"

"అదెనే? మాతోటి తినద్దా?"

మల్లికాంబ మాట్లాడలేదు- ఎడం సెయ్యి సెంప కానిచ్చుకొని పొయ్యికాడ కూసున్నది. మల్లికాంబకు తనయ్య యాదికచ్చిండు. గిట్లనే ఎత్తుకెత్తు ఉండెటోడు. గిట్లనే కళపెళ మాట్లాడేటోడు.

బువ్వలు దిని పక్కలమీని కెక్కిండ్రు- నర్సింహం కొర్రాయిబట్టుకొని పెరటి కాడికి తయారయ్యిండు- ఎందుకనో పెంద్రియ్య మంచాల కూసుండిపోయిండు.

"పాపన్నకు బొయిల పని దొరికిందిర సెందర్రియ్య."

"మా దొరికింది."

"జీతమెంతనో ?"

"అయిదు నూర్లట."

"వావ్వో! అయిదు నూర్లే!" మల్లికాంబ గుండెమీద సెయ్యేసుకున్నది.

తల్లిముంగట కూసున్నసత్తెమ్మ "అయిదునూర్లంటె ఎంతనే అవ్వ?" అడిగింది.

"ఇంకేంది మీకట్టాలు కడతేరినయ్." నర్సింహం....

సెందర్రియ్య అధాటుగ మంచాల లేసి కూకున్నడు....

"ఆ! మాతేరినయ్! ఇంటికాన్నుంచి పంపకుంటే మేమే మారాజులం! ఇంటి కిత్తచ్చింది లేదు. సేతుల కొత్తమిగిలింది లేదు. అట్లత్తె ఇట్ల పోవుడేనాయె- అడ పియ్యసుత బెల్లంకన్న పిరం- ఇన్నావే- నేను మూడుసార్లు బోయిన- అగ్గిపెట్టె అంత పందుల గుడిసెలు- కూకుండిపోవాలె- పాత తట్టల గోడలు- నన్నోపారి బొయిలకు సుత తీస్కపోయిండు- కాల్లీడ్సుకుంట ఓ ఊరుపెట్టు బోవాలె- తల్లి కడుపులకు బోయినట్టు- ఏపెల్ల మీనకూ లేది ఎరుకిలేదు. అడు అట్టిగానే ఇత్తండా రకిం? బొగ్గుదిని బొగ్గేరుతే ఇత్తండు. అదీ నూర్రూపాల పనిజేత్తే పదిరూపాలిత్తండు- అడ మనూల్లల్ల దొరలున్నట్టుగనే దొరలున్నరు- ఆడ మాదిగిండ్లున్నయి- పదేండ్లబట్టి పన్జేసెటోన్ని సూత్తె కండ్లకు రకుతమత్తది. కామిండ్ల రోగపోనితీగ్గ తెల్లబడిపోతరు- లంజకొడుకులు నక్కెత్తులోల్లు అడ అడకో సారదుకాణం బెట్టింద్రు- బొయిల దొక్కలిరుసుకునుడు. మల్లగ తీట తిమ్మర్లు పర్సిపోను గొంతికెలకచ్చేదనుక తాగుతరు. ఏడ బజాట్ల దుబ్బల పడిపోతరో? తెల్లారి లేసి దులుపుకుంట దులుపుకుంట పనిమీని కురుకుతరు- అదో నరుకం సిన్నాయిన నరుకం...."

నర్సింహం తుపుక్కున ఊంచి సెందర్రియ్య మొఖం సూసిండు.

"అయితే పాపన్న సుత తాగుడు మరిగిండా ?"

"ఇంత వరదనుకైతె లేదు- గందుకనే నూరూర్రిపాలు పంపుతండు తినంగ సెయ్యంగ- తాగినోని పనేసూటి- ఏడబన్న నిరంధిగ పంటడు- పాపన్న మాపటించి ఇంటికచ్చినమోలె పిల్లిబట్టిన కోడోలె కూసుకుతడు- నిదురరాక కొట్టుకుంటడు- నాత్రి పిక్కలెక్కత్తన్నయని మొత్తుకుంటడు- అదినె నేను రాంగ ఏడిసింది- "గీడ మన మాటగాదు- మన ఊరుగాదు మరిది- వక్కోడు సచ్చినా ఎవడు పట్టించుకోడు-" అని-"

"ఏడికి బొయిన ఏడేమాన్కలున్నట్టున్నది సూడవోతె-" నర్సింహం.

సత్తెమ్మ నోరెల్లబెట్టి గుర్రుకొడుతంది.

"ఏడికిబొయిన కొలిసెటోడొక్కడే సిన్నాయిన- ఈడ అవ్వనక్కను లంజె కొడుక లవుక కొడుకని తిట్టిన దొరే ఆడ బాసల కాకిరి బీకిరంటండు కాకుంటె అయ్యా అప్పఅని పన్జేయించు కుంటండు- మెత్తగున్నంత కాలం మనమందరం ఏడికి బొయిన గీ పుల్లెండలే పత్తం- రామేశురం బొయిన సెనేశరం మనెంబడే ఉంటది- ఎందు కెరికేనా సిన్నాయిన మనం గరీబోల్లం- మనకు కొండంత ఆకలున్నది- అళ్ల తన్నిన గుద్దిన తిట్టినా తిమ్మినా మనకర్మ, నొట్లరాతని సదురుక పోతం- ఎన్నడైన ఇసారి చ్చిండ్రా- ఎయ్యిమందిని ఒక్కదొర అడిత్తంటంటె- ఎయ్యిసేతులు ఒక్కటయినయనుకో ఏమయితది- అని సేతులిదిగిపోతయ్- కని గట్లకారు- కాకుంట మనకు కోటొక్క దేవుల్లడ్డుపత్తరు- కని ఆ దెపసం రావాలె- అత్తది-" కుడిసెయిమడిసి మంచం పట్టె మీన గుద్దిండు.

"మాటలు బాగనేర్సినవుర నాతండ్రి, నువ్వెట్లయిన మానాయిన్నవేరా సెందురన్న-" మల్లికాంబ సంబురపడ్డది.

నర్సింహం ఇసారంల పడ్డడు- గిదేదో కొత్తమాటిన్నడు.... "ఏందేంది గరీబోల్లంత ఒక్కటయితే-" మల్లమల్ల గునాయించు కున్నడు- సెపుమీని సుట్టతీసి కొర్రాయి కంటుబెట్టుకున్నడు.

"సరెగని- మీనాయిన్నేం జేత్తండు ?" అన్నడు నర్సింహం- అతనికెందుకో సెంద్రయ్యను సూత్తె భయమనిపిచ్చింది.

"ఏంజేత్తడు ? ఉన్నపని ఊడ్సుకపాయె- అప్పులు చేరినయ్గని- కడుపులే ఉన్నయ్- కడుపులు కాలకమానయ్. మల్ల అప్పుకురకక మాసం- ఎవడన్న ఉంచు కుంటె కంచెకావలో ? సేనుకావలో ఉంటనని తిరిగిండు- ఎవడుంచుకుంటడు నెత్తురు సచ్చినోన్ని ? ముసలెద్దును ఎవడు కొనుక్కుంటడే- సేకయ్కిలు సేత్తండు."

"ఏడ మొదలేసిన అడికే తెత్తన్నవ్."

"నేను తెత్తలేనే సిన్నాయ్నా- మనమంతా అడికే అత్తన్నమ్-" అన్నడు సెంద్రయ్య. ఎందుకనో సెంద్రయ్య కండ్లల్ల గుబగుబ నీల్లచ్చినయ్- ఎలుగు రాసిన గొంతికతోని, ఎదఎగిరెగిరి పడంగ సెప్పకపోతుండు.

"పాపన్న మొన్న ఏడిసిండు- ఏడబొయిన యమ బంకిఖానేనుర తమ్మిడా అని- నాయిన మాటే బందుసేసిండు- గిదిరా కొడుకా అనడు- నేంజేసిన తప్పేందో

సమఝయితలేదు- మనం బతికేది బతుకుగాదనుడు తప్పేనా ? ఊల్లె ఉండకు పో, ఏన్నన్నపడి సావు పో– నేను బతికినంత కాలం ఒకలతోని మాటబడి బతుకలే.... ఊరు కోడైకూత్తంది.... నీ కొడుకు ఏగయ్యిండని ... సిన్న పోరనోల్గె లల్లె పాటలు పాడుకుంట తిర్గుతండు- మొన్ననట దొరోడు బిలిసిండట- "ఆయిలిగా నీ సిన్నకొడుకును ఊరుమీన జన్నెకిడిసినావుర ? పనిసేసుక బతికెటోల్లను సెడగొడ్తండు- ఏదో నువ్వు మర్యాద మనిషివని పిలిసి సెప్తుతన్న- ఎవలెవల ఊల్లెకత్తండ్రు పోతండ్రు- వారీ ! నేను తలుసుకుంటె మసైపోతర్రా- అయింక సన్నసద్దని" వోరకుబిలిసి సెప్పిండట- మాలావు పావురం కారపోంగ అది పట్టుకచ్చి సింతసెట్టెత్తు ఎగిరిండు.... "నేంజెప్పినట్టు ఇను అన్నడు"– "ఏంది నువు సెప్పేదన్న"– "సోపతులిడిసిపెట్టి జెర పెయిల భయముంచుకొని ఎవలకన్న పాలేరుండు–"

"ఉన్నంక ఏమయ్యిద్ది...."

"పెండ్లిజేత్త సేసుకో– బతుకు– నాకు పేరుదే !"

"నీకున్న పేరేంది....?"

"కండ్లు నెత్తికెక్కినయ్ లంజకొడుక్కు–" అంతెత్తు లేసిండు.

"పెండ్లి జేసుకొని మీరంత బావుకున్నదేంది ? అప్పులు.... సాలని కడుపు.... పిల్లల గన్నవ్.... ఒకన్ని కానరాని ఊల్లెకు తోలిచ్చినవ్.... నేను పాలేరుండ– ఎవని కొలువు గొలువ."

"మరేంజేసి బతుకుతవ్రా... ?"

"అదే ఇసారిత్తన్న.... అసలా బతుకే లేదు గదా ! మొదుగాల బతుకేప్పుడితె ఏం పనిజేసుడో తేల్తది– నేను ఒకలకోసరం పన్జేయ– నా కోసరం పనిజేసుకునే దనుక గిట్లనే తిరుగుత. అంతలావు దొరకు పావురముంటె నన్ను ఎర్రి కుక్క– నెందుకు జేసిండు ! అడ్డికి అడ్డిగట్టి ఖామెందుకు గుంజుకున్నడు. నేను గదే అంటన్న– ఉన్నట్టుంటె సచ్చేటంత కోపం– గది ఎరుకసేసుకో నాయిన్న అంటన్నా."

"కొమ్ములు మొలిసినయా ? సెవులురా ? కొడుకు బుట్టి తండ్రిని నది వేసినట్టుగున్నది ఎవారం.... ఇన్నావె ఇటురా లంజెకొన...." అవ్వను బిలిసిండు.

"సాల్లే సంబడం ! ఆనితోనేందో తెగెదాక బిలిత్తన్నవ్.... ఎరికలేదా ? ఆడే మంటండు ఏంసంపాయించి ఇచ్చిన వంటండు" అన్నది.

ఇగట్ల లేసిండు అవ్వను గుప్కీగుప్కీన గుద్దిండు- నాకట్ల కోపమచ్చింది- తమాయించుకొని అడ్డంబొయి ఇడిపిచ్చిన- మీదెగబడి కొట్టిండు- మంచాల కుదేసిన- ఇగ నాకు అడ సిడంసేపు ఉండబుద్దికాలే.... అట్లఎల్లచ్చిన" సెంద్రయ్య ఆపిండు.

"అక్కో.... అక్కా...." పల్లికొంట సన్నగా శోకం మొదలేసింది.

"ససరాదే.... అక్క కేమయ్యింది- మక్కెస...." నర్సింహం కసిరిండు.

"సెంద్రన్న సూడవోతె నీకు సెప్పేటట్టుగలేదు- గని ఏదో అయ్య జెప్పిన ట్టింటేందిర నాయిన్నా...." నర్సింహం బతిమిలాడిండు.

"నాదే తప్పంటావే సిన్నాయినా? పాలేరుండు మంటవ? నాత్రి పగలు అని సేన్లల్ల సెలుకల్ల నెత్తురు కలికలి సేసుకోమంటవా?" అన్నడు ఏడుపు గొంతికతోటి.

నర్సింహం అట్ల అసలేఃపోయిండు.

సెంద్రయ్య మంచంలనుంచి లేసి నిలుసున్నడు.

"అది జరుగనిపని: నాబొందిల పానముండంగ గట్ల నరిగెపడి సావ- ఇదివర కంటె ఎమ్మొకని- ఇప్పుడట్లగాదు- సత్తె కొట్లాడుకుంటనే సత్త."

"ఏందిర కొట్లాట- ఎన్ని జర్గుతలేవు-" నర్సింహం విసుక్కున్నడు.

"ఒకని బాధ ఒకడు లెక్కసేత్తలేడే సిన్నాయిన- నాయిన్న సెప్పిండు నీకతంత అదెనే- మీదొర కంబాలు పీక్కపోతె నువ్వెందుకు గట్ల తండ్లాడినవ్- నప్పుడు సెయకుంట ఊకుంటె గాకపొయ్యిందా?"

నర్సింహం మాటలురాక ఇరుకున పడ్డడు- ఖిన్నుడై సానాసేపు కూకున్నడు- ఆకిట్ల సెంద్రియ్య ఆడికీడికి తిర్గుతనే ఉన్నడు- అయినె కండ్లు అగ్గి నిప్పులోలె ఎల్గుతన్నయ్- గుడిసె గలుమల నుంచి దీపం ఎలుగు తెల్లసీరెతీర్గ ఆకిట్లకు పరుసుకున్నది- ఎలుగు కచ్చినప్పుడల్లా నర్సింహం సెంద్రయ్య కండ్లను సూత్తనే ఉన్నడు.

"ఇంతకు నువ్వేమంటవుర సెందురన్న?" నర్సింహం లేసి నిలబడి అన్నడు.

సెంద్రయ్య ఏమంటడో సెప్పలేదు- నర్సింహం మళ్లఅడుగలేదు- "ఆగిన్య మైంది నక్కలు లేసినయ్- పండబోవాలె- రేపొద్దుగాల అనుకుందాం ఇప్పటికైతె పండుకో-" అనిసెప్పి గుతుపకట్టె భుజాన బెట్టుకొని ఇసారిచ్చుకుంట నర్సింహం పెరటికాడికి పండబోయిండు.

ఆదినం రాత్రంత నర్సింహం ఎందుకనో కంటిమీన రెప్పెయ్యలేదు-సెంద్రయ్య ఏంజెప్పిండో ఎంత కొట్టుకున్న సమజ్ కాలేదు.

*　　　*　　　*

సీకటి సీకటున్నదనంగనే పెరడికాడికి సెంద్రయ్య ఎడ్ల కొట్టుకచ్చిండు- మోట గట్టిండు- "మోటగట్టిన్నే సిన్నాయినో" అరిసి కీకఱెట్టి ఎడ్ల అదిలించిండు. మోటగిరె మొత్తుకున్నది- బొక్కెనె బొలబొల నీళ్లబోసింది.

నర్సింహం పార ఎనుకులాడుకొని పెరట్ల జొచ్చిండు.

"రెక్క సాయముంటె పని ఉరుకుతది- సెంద్రయ్య ఉండెపటికె అదే ఎడ్ల కొట్టుకచ్చి మోటగట్టె, లేకపోతె ఈడ్సుకుంట ఈడ్సుకుంటబోయి పిల్లను దీస్కచ్చి మోట గట్టెటాల్లకు బారెడు పొద్దెక్క- అటువట్ట ఇటుబట్ట మోటగొడ్తె దానికి నీల్లు గట్టరాక ఆగమిడిసిపెట్టె- ఆఖరుకు నాలుగు కాలువలు బారె- ఎనక పెరడు నీల్లందక ఇగిలిచ్చే-" అనుకున్నడు.

కాలువపొంట నీల్లు బొబ్బలుకొట్టుకుంట ఉరికత్తన్నయ్- సెంద్రయ్య ఏదో పాటందు కున్నడు.

పచ్చ పచ్చగ నువ్వుంటివా ఓ దొరా !
　　　　పచ్చంగ నువ్వుంటివా !

పెచ్చులకు అడ్లిచ్చి
పెచ్చుపెచ్చులు గట్టి
పెద్ద బంగ్లా గడితివా ! ఓదొర !
　　　　బుడ్డగిర్ని బెడితివా !"

నర్సింహం ఆలకించి ఇంటండు.

సెంద్రయ్య నోటికి ఇరాములేకుంట పాడ్తనే ఉన్నడు. గదాంట్ల దొరలు, పాలేరోల్లు, సిన్నరైతులు అందరత్తంద్రు- కొందరు ఏడుత్తంద్రు- కొందరు నవ్వుతంద్రు.

గ పాటలన్ని నిచ్చమే ననిపిచ్చినయ్ నర్సింహంకు-

సెందర్రయ్య ఎడ్ల బీల్లమీని కిడుసుకపోయిండు. పగటీంచి సద్ది తెచ్చిన మల్లి కాంటతోనన్నడు నర్సింహం....

"అవునె పోరడు సూత్తె మానిక్కమనుకో.... సెకుడ- మనకా మొగ పోర గాండ్లు లేరు- ఎన్నేండ్లు తిప్పలుబడ్డా పారేసెటోడు ఒకడుండాలె గదా! నాకేపని పిత్తందంటే...."

"సాదుకుందామంటవ్...."

"అవునే నాగల్లెనే అన్పిత్తంది...." అన్నడు నర్సింహం.

"అన్పియ్యేది మరి.... పోరి నెవలింటికి దోల్తవ్? ఓ గరీబు పిలగాన్ని సూసి ఇల్లుటం దీస్కచ్చుకుంటె పిల్ల మనకండ్ల ముంగట్నే ఉంటది- ఖదరుకు ఖదరుంటది- మనకున్నదేంది? మల్ల పిల్ల లగ్గమెట్ల సేత్తవ్?"

నర్సింహం మాట్లాడలేదు- అదిసుత నిచ్చమే ననిపిచ్చింది.

మూడోనాడు ఎంత ఉండుమన్న ఉండకుంట 'పనున్న'దని సెంద్రయ్య ఎట్లచ్చిండో అట్లనే ఎల్లిపోయిండు-

"ఇగ నాకు తిరుగుడే పనే సిన్నాయిన.... అప్పుడప్పుడు అచ్చి పోతనేఉంట" అన్నడు పోవుకుంట.

మల్లికాంబ ముక్కుసీది సానాదూరం సాగదోలింది.

నర్సింహం మనుసు మాత్రిం కకవికలైపోయింది- సెరువుల బండిసిరినట్లని పిచ్చింది- నిల్సున్న కూకున్న సెంద్రయ్య పాటలే యాదికత్తన్నయ్- "పోరడు సెప్పిందాంట్ల నిచ్చమే ఉన్నది- కని...." అక్కన్నుంచి ముందుకు ఇసారించలే నర్సింహం.

## 9

మాఘమాస మెల్లిపోయి పాల్గుణ మాసం నొచ్చింది- ఇప్పల ఈదర తగ్గింది- ఎండలు ముదురుతన్నయ్- గొండ్లోల్లు పరుపుతాళ్ళు గీసి లొట్లు కడుతంద్రు.

ఆఖరి పంటలు సేతికచ్చెయ్యాల్ల- గీ దినాలల్లనే పరిగో, కూలో దొరికి కూసంత కడుపు నిండ దింటరు కూలోల్లు- పునాసలమీన ఓ పదిపదిహేను రోజులు, అరికోతల మీన ఓనెలరోజులు- మల్లగిప్పుడు ఏసంగి అరికోతలు మక్క, తెల్జొన్న, మిరుప తోటలు అన్ని ఒక్కపారే పంటకత్తయిగన్క గిప్పుడో నెలరోజులు పనిదొరుకుద్ది- కడుమ కాలమంత కడుపులకు కాల్లిగ్గుకొని కాల్లు గడుపులు బట్టుకొని అప్పోసప్పోసేసి బతుకుతరు జనం.

దొర, మోతెపరి రైతులు కోతలు కోపించుకొని కుప్పలేసుకునే పని మీద పెనంసేపు తీరికి లేకుంట సతమతమైతండ్రు.

కూలోల్లంత తొలి కోడి కూతతోని మంచాల నుంచి దులుపుకుంట దులుపుకుంట లేత్తే- సిమ్మంసీకటి ముసురుకోంగ ఇండ్లు సేరుకుంటరు- కాల్లీడ్సుకుంట- అలసిపోయి సేతులు పొక్కులచ్చి, మెడసరాలు నొయ్యంగ గ నొప్పులన్ని మరిసిపోను ముచ్చెట్లాడు కుంట ఊల్లెకత్తరు.

ప్రతాపరెడ్డి దొర ఊర సెరువుకింద ఏసంగి పొలం కోతపట్టిండు. ఆడ, మగ పిల్లాపీసు పొద్దందాకా బాకులు తీరి పంజ గొట్టెటోల్లు పంజ కొట్టంగ, కోతలు కోసేటోల్లు కొయ్యంగ, మోపులు గట్టెటోల్లు మోపులుగట్టంగ, మోసెటోల్లు మోయంగ, కొట్టిన అరిగడ్డి కుప్పపెట్టెటోల్లు పెట్టంగ, పరిగెలేరేటోల్లు పరిగెలేరంగ- ఒకని మొకమొకడు సూసేటట్టు లేకుంట తీరకుంటున్నరు.

అరిగడ్డి సప్పుడుతోని, అరిగొలుసుల రాపిడితోని, కయికిలిగాల్ల అరుపులతోని, షెకెదార్ల తిట్లతోని, పసురాలు కోసిన కొయ్యకాల్లు పీక్కతింటాంటే 'బరుకు బరుకు' సప్పుడుతోని ఆడంత గడబిడగా గందరగోలంగ ఉంది. అరిగడ్డి ఆసన, బురద ఆసనతోటి గాలి నిండిపోయి కమ్మటి పంట ఆసన అత్తంది.

ప్రతాపరెడ్డి పంజగొట్టేకాడ పందిరికింద కూకుండి సెనసెనానికి పెరగిపోతన్న అడ్లరాసిని సూసుకుంట సికిలేటు తాగుతండు- షెకెదారు బాలమల్లు, రాజన్న సెరో దిక్కు నిలుసుండి కూలోల్ల ఇవరాలు, పంట ఇవురాలు సెప్పుతండ్రు సేతులూపుకుంట.

దొర "ఆఁ.... ఊఁ...." అనుకుంట ఇంటండు.

"రాజ! గీడ నీడకు నిలుసుండి, తియ్యటి మాటలు సెప్పక, గ అరికోతకాడికి నడువలేవుర! అగో లంజెల నడుములు అంగుతలెవ్.... కొయ్యకాలు బాగిడుత్తండ్రు- అంగి గు... లకు కొయ్యిమను- అసలే గడ్డి కరువచ్చేటట్టున్నది-" దొర కీకలేసిండు.

సెకెదారు రాజన్న కోతకాడికి ఉరికిండు-

"ఇంకా కిందికి గొయ్యండ్రెహె.... నడుములంగుతలెవ్వా! ఏడంగుతయి? కొత్తపాత సందాయె- తినేది హంసడ్ల మెతుకులాయె" రాజన్న ఆడోల్లను కసిరిండు.

"బా బాంచెన్! ఇద్దరాలుమొగల కొక్కటే మెతుకు- మెతుకుదిన్న మూండ్రోజులు అరుగక ఏరుగబెట్టిందట- మూడుసోల్ల అరిగింజలు దిని నడుముల్ నిలకొట్టినయ్ బాంచెన్...." అంకరికాల్ల లింగు కాల్లు నిలేసి సేతులు తిప్పుకుంట అన్నది.

"నువ్వుండరాదొహొ! అరొద్దుమీన నిలుసుండి అర్సి కీకలుబెట్టేటందుకేంది? గూని సమ్మన్నసుత ఏత్తడు-" బానపోసు పిరికిడి నిండ అరికర్రలు పట్టుకొని పీక్కచ్చిన బురదను కొడవలితోని నరుక్కుంట అన్నది.

"ఏందేందే? ఇప్పటి మాటేందే? బానపోసి నకురాలుసేత్తన్నావే? నీయవ్వ! ఆడిదాకత్తె...."

"ఏంజేత్తవయ్యో- మారె! నకురాలు సెయ్యాన్నంటె సలువసేసిన బట్టలుండాలె- తలకు సవరుండాలే- ఒంటిమీన రయికెపేగు లేనిదాన్ని నకురాలేంజేత్త బాంచెన్!"

దూరంగ కయిలి కోడె రంకేసింది.

"కొల్లాగెకు కొత్తపాతసందు బలుపెట్లచ్చిందోసూడు. బక్కెడ్ల మీనికి కాల్దువ్వ తంది రాజన్న పటేలోలె-" మైసమ్మ గుంపులె నుంచి రాజన్న షెకెదారుకు ఇనచ్చె టట్టన్నది.

కూలోల్లంత కుసామతుగ నవ్విండ్రు.

రాజన్న మొకం మాడ్సుకున్నడు.

"ఇయ్యేడు ఎకురాన పదిహేనుబత్తాలు ఒల్లెక్కాలకు రాల్తయి నీల్లంద లేదుగని ఇరువై బత్తాలు రాలు-" బాలమల్లు.

దొర అడ్ల రాశికెల్లి తృప్తిగ సూసిండు.

"వారీ! బాలమల్లు! మిరుపతోటలకు నీల్లందుతున్నాయిరా!"

"కరంటు పంపు సాలయిన కాన్నుంచి నాలుగైదు తల్లుదిర్గె! ఏరియ్యాలె- కూలోల్ల కగ్గిదల్గ! సుట్టు పదూల్లు దిర్గిన దొరుకుత లేరు. మ్రిడి దినాలు బడ్డకొద్ది రంగు పోద్ది- రంగుబోయిందా? గింత కట్టం గంగల కలిసిపోద్ది- మన పని గోవిందే! ఎవడుసీదడు ధరపలుకది."

పంజగొట్టేకాడ ఎవడో దెబ్బదెబ్బకు మూల్గుతండు- ఇంకెవడో ఎడ్లకాడ "పంజగొట్టేకాడ పాలిండ్లు సూపింది- అచ్చింది నాలచ్చిమి-" గొంతెత్తి బూతుపాట పాడ్తండు. ఆకాశంల గద్దలు గిరికీలు కొట్టుకుంట ఆడుతన్నయ్- జలజల అడ్లు రాల్తన్నయ్- కుప్పముంగట కూకుండి పొల్లు బుసి దూరం జరుపుతన్నోడు సన్నగా "పొలిగాని" పాట పాడ్తండు.

"నర్సిమ్మడు పెరడి గోసిండా?" దొర తుపుక్కున కిందఊంచి గొంతు సన్నంగ పెట్టి గుసగుస అడిగిండు.

"ఆఁ! మాకోసిందు పెరడి - అని ముసలి బక్కలు మోపేడగొట్టినయ్- సగం నీల్లందక ఎండిపోయింది. సగం "ఏదె" (చెదలు) గొట్టింది. తూరుపుదిక్కు- గుడ్డేలుగులు దిన్నయ్. మాఅంటె పది బత్తాల మక్కలైతె సుక్కల్ జలజల రాల్తయి."

"అని పంపు నేంజేసిండు?"

"ఏంజేత్తడు? తెచ్చిన బాకీకి కోమటి రామలింగం తడిపెడిన మనుషుల దోల్తండు. పంచేమొ ముద్దిమీన యూడిచ్చితన్నె- కాపురమంగిపాయె- అమ్ముతనని ఆడికీడికి దిర్గుతె ఎవడు సగందర పెట్టనంటడు. అని బతుకు అపును జూసుకొని బలుపని బమిసినట్టయ్యింది. అయినా దొరా! అని పదమంగలే- నేనెప్పుడన్న అని గెట్టుమీన్నుంచి బోతె మారేసి సూత్తడు. అటెంక మీకాడ సెప్పద్దనుకోండ్రి- అసోంటి మాటలని కాండ్రికిచ్చిఊంచుతడు-" బాలమల్లు కూసంత దొర దగ్గెరికి జరిగి గొంతికె తగ్గిచ్చి- "మనూల్లె ఉడుకునెత్తురు పోరగండ్ల, తట్టెర బుట్టెరగాల్లను కుప్పేసి నడిజాము తిరిగిపొయ్యేదనక గుసగుసలు పెడుతండ్రు- దొరా! కొత్తకొత్త మొకాలు ఊల్లెకచ్చి పోతండ్రు- ఏనంగత్తండో ఏనంగపోతండో లంజకొడుకులు పట్టుకత్తా మంటె కనిపిచ్చినట్టె కనిపిత్తరు- కనుమూసి తెరిసేటాల్లకే మాయమైపోతరు. మీదా కెందుకు రానియ్యాల్నని ఊకున్న? ఏనుగును జూసి కుక్కలెన్నో మొరుగుతయని దమ్ముకాసిన- ఏమున్నదిదొరా! మొన్న మాదిగిండ్లల్లకు కయికిల్ల కోసం పోతే- ఎన్నడులేంది, "కయికిలెంతిత్తరని" అడిగిండ్రు- నా గుండెల రాయిబడ్డది. మాదుగులకు మార్నగాలమచ్చిందని పల్లెమీనికి బోతె అడ గదే మాట- మాదిగి బొత్తోడులేడు? గ అమ్మోరి మొఖపు సీరటికాడు, అడయితె మీది మీదికచ్చిండు. 'ఆరుగాలం సేయించుకొని జీతాలెగబెట్టే తమరు గింతోలైండ్రిట- కూలోల్ల కొడండ్లు…" అని మాటలకేంగని నర్సిమ్మనికి ఎర్రి లేసిందుండ్రి- గ పంచాతి ఏమంట జర్గిందో- అడు దండుగు ఏనాదెగబెట్టిండో అగో గప్పటి నుంచి అని కండ్లు సాలెకొర్రిమట్టోలె నెత్తి కెక్కినయ్. లబ్బికొడుక్కు పెయికంగి లేదుగని పెద్దపోకిల్ల మాటలు….

ఆడెవడో అని సడ్డకుని కొడుకట- అడు ఊకె అచ్చిపోతండు- అన్నిసూత్తెనే దొంగ తిర్గున్నడు- పక్క దొంగ సూపులు…. ఎర్రెకండ్లు…. మనిషేమంత మందం లేడుగని, జేల్లనుంచి పారొచ్చినోని తీర్గున్నడు- ఆ లంజకొడుకు అసుల దారమోలె ఊల్లెకచ్చిండంటె ఒక్కకాడుండడు- గుడిసేపు మాదిగిండ్లల్ల ఉంటడు, గుడిసేపు పల్లెమీన తాల్ళతనుగులు పేస్తడు…." బాలమల్లు ఇడుగు ఇరాములేకుంట మునుంబెట్టి సెప్పుకపోతండు.

"అయితే తొండ ముదిరి ఊసరెల్లి అయిందన్నమాట- కాలం మంచిగలేదు.... అడాడ కమినిట్లోల్ల భయం ఇనవడ్తంది.... బాలమల్లు! ఓకంట కావెట్టుకుంటుండు- ఏ కమినిట్టోడు నా రోమం బీకలేడనుకో.... కని మన జేగర్తల మనముండాలెగద- తల్సుకుంటె ఊళ్ళె కూలి లంజకొడుకులు కూడులేక ఒర్రిసావాలె- మాదెర్‌సోదు ఏదో పోనియ్యని ఊకుంటె లంజకొడుక్కు పెయిమీన ముల్లుబెరిగింది. అని నకురాల్ నా కాన్నేనా?" దొర అరిసేతుల అడ్లుబోసుకొని పండ్లు బిగపట్టి నలిసిండు- పొట్టాది బియ్యం గింజలు నోట్లేసుకున్నడు- మొఖంల అప్పటికే కుట్ర కుదురుకున్నది.

".... .... ...."

"బాలమల్లా! గీ అడ్లు ఎండబోపిచ్చి గరిసెల బోపియ్యి- లేకుంటె ముక్కి అనుకున్న ధరపడది."

"మంచిద్దొర...."

"ఇగో నేనుబోతన్న- ఇయ్యాల్ల కయికిల్లు గొలువు- ఏందో మర్సిపోతి.... ఆఁ బాలమల్లా! నాత్రికిగలువ్- 'నీవోల్ల' నుండుమను- సమఝయ్యిందా? పెద పోశన్ని తాల్లల్లకు దోలు, పదికడువల కల్లుదెచ్చుకోండ్రి- వారీ! ఇగో! జెరమనుసు బెట్టిను- ఇయేడు పల్లెమీని గొల్ల కత్తెరసాలడు అంతుపిల్ల నింక పంపలే- లఢ్డికొడు కేమనుకుంటండో.... ఇయ్యాల్ల తెచ్చుకొని జల్తజేసుకోండ్రి- ఎవడన్న నాలికెదిర క్కుంట తప్పదాగుతె ఈపు మెదుగుద్ది- ఇన్నావురా!.... నేం జెప్పినయన్ని మతి కున్నయ్‌గద...." దొర సన్నంగ జెప్పి సవారు బండెక్కిండు.

సుంకరి రాయనర్సయ్య దూరంగ నిలుసున్నోడు ఉరికచ్చి దొర సెప్పులు బండ్లేసి కచ్చులం ముంగట ఉరుకుతండు.

బండి ఒడ్లమీనికెల్లి దునుక్కుంట ఉరుకుతంది.

వరిగె లేరుకునేటోల్లు వరిగె కర్రిలు కొయ్యకాల్లల్ల పారేసి- నిలుసుండి పోయిండ్రు.

* * *

ఊరులుకు మగ్గింది.

షెకెదారు బాలమల్లు దోతికొస సంకల బెట్టుకొని తలంచుకొని నిలుసున్నడు.

ప్రతాపరెడ్డిదొర పులితోలు కుర్సిల ముంగటికి అంగి కూకున్నడు.

ఇద్దరి దగ్గెరినుంచి కల్లు అసన గప్పగప్ప అత్తంది.

## కుప్ప కాపలా

పి. సి. ఎస్.

దొరోడి ధాన్యం కుప్ప
కాపలాకాసే కైకిలోడికి [1]
కుప్పచుట్టూ బూడిదగీత కాపలా
వ్యక్తి నమ్మకంగా ఉన్నా
వ్యవస్థ నమ్మదు వాణ్ణి
ఇది
బూడిద గీతలు కాపలాకాసే
దొరోడి వ్యవస్థ

1. కైకిలోడు = కూలీవాడు, జీతగాడు (తెలంగాణా)

---

"రెండో కంటికి దెల్వకుంట పనిగావాలె- ఇన్నావురా! అడు లేకుంటే అవ్వల్దర్జ- ఉంటే ఇంకా మంచిదే- మల్ల అనువాలు దొరుకద్దు- అడు అడలేకుంటే అని జోలికి పోకుండ్రి- మీరని తెలిసిందో బంచత్ ! అందరిని లైనుగ నిలుసుండబెట్టి తుపాకినేసి సింతచెట్టుకింద పాతిపెట్టిత్త. ఇగ నడు.... పెయిల బయముంచుకో...." దొర కుర్సిల నుంచి లేసిండు- నిట్టనిలువుత నిలుసున్నడు. కండ్లు నెత్తురు సిమ్ముతన్నట్టుగ, నిప్పులు కురుత్తన్నట్టుగ మండుతున్నయ్.

అంతెత్తు నిలుసున్న దొరను సూసేటాల్లకు బాలవ:ల్లు కాల్లల్ల అనుకుబుట్టింది- గిర్కున ఎనుకకు దిరిగి ఎల్లిపోయిండు.

"నర్సిమ్మా! నిప్పుతో సెలగాట్టమాడితే మాడి మసిబొగ్గయిపోతవురా కొడుకా! నిన్నొక్కపారి సంపరా! ఒక్కపారే సత్తే.... సానా రోజులు.... రోజు కింత సంపుత...." దొర పండ్లు పిండివడ కొరికిండు- ఇంట్లకు నడిసిండు- ఒక్కొక్క మెట్టే మీదికెక్కి పోయిండు.

(ఇంకా వున్నది)

## జ్ఞాపకాలు

ఎన్.కె.

ఇప్పుడు నువ్వున్నావే
జైలుగోడ
గదిగోడ
ఆ గోడల నడిగి చూడు
ఆ గోడల తడిమి చూడు
రక్తం కన్నీళ్ళు కలిసి
కురుస్తాయి జ్ఞాపకాలు

ఎప్పుడైన కన్నావా
కటకటాల వాకిటి కల
చిన్న గేటు తలుపుధ్వని
ఎప్పుడైన ఖైదీగా
ఇలా నువ్వు ఖైదీగా
వుంటాననుకున్నావా
అనుకునె వుంటావు నువ్వు

శబ్దనిశ్శబ్దాలు:

## రాతిమీద రాజనాల్ పండేవేళ....

సురా

మనం బతికే శబ్దమయ ప్రపంచంలో వినపడకుండా సాగే సమాజపు గుండె చప్పుడు ఎప్పుడో పుష్కరానికోసారి క్షణకాలం భయంకరంగా మోగి మళ్ళీ తన అగాధపు నిశ్శబ్దంలోకి జారుకుంటుంది. అప్పుడు, అలాటి క్షణాల్లో దేశమంతా కమ్ముకున్న రెండువేల కారాగారాల్లో నిండిపోయిన లక్ష ఇరవైవేల ఖైదీల గురించి మన ఆలోచన్లు మళ్ళుతాయ్.

ఎవరు వాళ్ళు?, ఎవరు వీళ్ళు?

ఖైదీలు, కాని నేరస్తులు కారు. సినిమాల్లో గొలుసు దొంగిలించిందనే ఆరోపణతో నాలుగేళ్ళుగా మగ్గుతున్న పన్నెండేళ్ళ పాప, సెకండ్ షో సినిమా నుండి తిరిగి వస్తుంటే పోలీసులు పట్టుకున్న రోజుకూలీ, ఎంతకాలం గడిచిందో లెక్క తెలియని స్త్రీ, బంగ్లాదేశ్ యుద్ధంలో శరణార్థిగా వచ్చి భారత ప్రభుత్వపు రక్షణలో ఏడేళ్ళు గడిపిన యువతి, ఏడు సంవత్సరాలయినా చార్జిషీటు చూడని కుట్రకేసు ఖైదీ, నక్సలైటు, బయట ఎవరూ లేరని చిరునవ్వు నవ్వే వేదాంతి, శిక్షపడకుండానే పదేళ్ళు గడిపిన ఎనభై ఏళ్ళ వృద్ధుడు, భాషరాని మెజిస్ట్రేట్‌తో బాధ చెప్పుకోలేక లోపలికి వచ్చిన పరదేశి, చెరచబడ్డామని పోలీసులకి రిపోర్టు ఇస్తే సాక్ష్యంలో వాళ్ళ సౌలభ్యం కోసం జైలుకి పంపబడ్డ మగ సమాజపు మౌన సాక్షులు, తమ నేరమేమిటో తెలుసుకోడానికి సంవత్సరాల తరబడి ప్రయత్నిస్తున్న బందీలు– నేరస్తులు కాని ఈ ఖైదీలు.

పదమూడడుగుల ఎత్తుగోడలు, వాటిపై చుట్టూ రెండు తీగలు, వాటిల్లో ఎప్పుడు ప్రవహించే కరంటు, గడిచే కాలాన్ని గడవని బతుకుని పావుగంటకోసారి గుర్తుచేసే ప్రాణంలేని గంటలు, రాళ్ళ, పురుగుల అన్నపు గంజి, వీటిమధ్య కాకీబట్టల కర్రల ఝళిపింపుల కనుసన్నలలో ఆరిపోయే వెలుగురేఖలు వీళ్ళు. స్వేచ్ఛలాంటి అందమైన భ్రమలుండటానికి కవులు కారు. విడుదల కోసం కాదు నేరం కోసం శిక్షకోసం వెతుక్కునే సామాన్య జీవులు. మాట్లాడటం రాని వాళ్ళు, చదవడం రాయడం తెలియనివాళ్ళు, కష్టాల ఒడిలో పుట్టి కన్నీళ్ళతో పెరిగి, ప్రతిధ్వని లేని ఈ ధ్వనుల మధ్య మరణించే పేదవాళ్ళు, ఈ దేశం ప్రజలు వీళ్ళు.

ఒకటి.... నాలుగు.... తొమ్మిది.... పన్నెండు.... కాలాన్ని వీళ్ళకోసం లెక్కపెట్టేవాళ్ళు లేరు. జీవితాన్ని వీళ్ళకోసం భద్రపంచేవాళ్ళు ఉండరు. వారానికోసారి కోటా ప్రకారం కేసుల్ని బుక్‌చేసే పోలీసులు వీళ్ళ రక్షకభటులు. చదువు డబ్బు ఉండి తప్పించుకోగల కలవాణ్ణి, శ్రమ జీవితం తప్ప ఏమీలేని లేనివాణ్ణి సరిసమానంగాచూసే రాజ్యాంగం వీళ్ళకు చట్టం, ఏళ్ళల్లో ఒక్కసారి కేసు పరిశీలించడానికి తీరికలేని కోర్టులు వీళ్ళకు న్యాయస్థానాలు, తన నేరాన్ని వీళ్ళమీద మోపే అసమాన సమాజం వీళ్ళ జీవిత నిర్ణేత.

సుప్రీంకోర్టు విడుదలచేసిందని ఆనందపడకండి- ఈ సమాజం ఇలా ఉన్నంత కాలమూ వాళ్ళలాగే ఉంటారు. ఎప్పుడో పుష్కరానికోసారి మోగే గుండె చప్పుళ్ళతో భ్రమపడకండి....

ఎప్పుడు తిరిగి వస్తారని ప్రశ్నించకండి.

మర్చిపోయిన జీవితపు మధుర ప్రణయగీతం ఈ జనపదుల శిథిలపు బతుకుల్లో వ్యంగ్యంగా, క్రూరంగా సమాధానమిస్తుంది....

రాతి బసవేశ్వరుడు రంకెవేసేవేళ
రాతిమీద రాజనాల్ పండేవేళ....

---

# విద్రోహం

ప్రసూన్ ముఖర్జీ

1 కిటికీ పక్కన
చిందరవందరగా కాగితాలు
పుస్తకాలు
మార్పులేని నీ జీవితానికి యివి తోడుగా వుండేవి

బిలాస్‌పూర్ నుండి నీ చిన్నమ్మ తరచుగా రాసేది
నెమ్మదస్తుడైన తన భర్తను గూర్చి
అధికార దర్పంగల తన అత్తగారిని గూర్చి
ఉత్తరం నిండా రాసేది.

ఒకరోజు మీ పొరుగింటి కుక్క
నీ నేస్తురాలు జయను వెంటాడింది
ఆమె మళ్ళీ యింటికి రాలేదు—
మబ్బులు సూర్యుణ్ణి కప్పేసినట్లుగా
బాధ నిన్ను అణచేసింది.

నీవు ఎప్పుడూ విచారంగా వుండేవాడివి
ఈ పట్టణం నిన్ను కుంగదీసింది
దాని పేగులు నిన్ను చుట్టేసినట్టు అనిపించింది నీకు
నీవు దాని కడుపులో బద్దె పురుగులా
దాన్ని కుదిపి యిబ్బంది పెట్టాలని
కత్తిపోటులా మొత్తం శరీరాన్ని నొప్పించాలని
ఫలితంగా అది నిన్నూ, నీ నేస్తం జయను బయటికి కక్కేస్తుందనీ
తరవాత నీ పొరుగింటి చిరుబురులాడే సంకరజాతి కుక్క
యథేచ్ఛగా పగలూ, రాత్రీ ఊరకుక్కలతో పోతుందనీ

2 మీ అమ్మ
పొయ్యిముందు కూచుని వంటచేసేది
ఒకరోజు ఆమె నిటారుగా నిలబడలేకపోయింది
రిటైరైన ప్రభుత్వోద్యోగి మీ నాన్న
పార్ట్‌టైమ్ ఉద్యోగం కోసం

నిత్యం పత్రికా ప్రకటనలు గాలించేవాడు
మీ అక్కయ్యలో నిశ్శబ్దంగా కోపం రగులుకొనేది
ఆమె కళ్ళకింద నల్లటి చారలు.

రాత్రిల్లో అప్పుడప్పుడు పోలీసులు
మీ యింటిని చుట్టుముట్టేవారు
పరారీలోవున్న నీ అన్నను వెతకటానికి
వారా చిన్నగదిని తలకిందులు చేశారు
వారి అలికిడిని అవరించిన నిశ్శబ్దం
నీకు వింతగా తోచేది
కాని ఏమిటో తెలుసుకోవాలనైనా
పొరుగింట్లో లైట్లు వెలిగేవి కావు
కిటికీలు తెరచుకొనేవి కావు

3 పరీక్ష హాల్లో నీ కెవతో చెప్పారు
మాగ్రాహట్‌లో ఒక చిన్న గ్రామంలో
కాజల్‌ను వాళ్ళు చెట్టుకి కట్టేసి కాల్చేశారని
మూడు రోజుల తరువాత కాజల్ యింటికి వచ్చి వాళ్ళు
చిన్నాన్నతో చెప్పారు, శవ గృహానికెళ్ళి శవాన్ని గుర్తుపట్టమని
చిన్నాన్న, చిన్నమ్మ యేడవలేదు
కాని కాజల్ తమ్ముడు పళ్ళుకొరికాడు

నెల రోజుల తరువాత అతడు యింట్లో ఒక చీటి వదిలిపోయాడు
"నేను కాజల్ కార్యాన్ని పూరించడానికి వెళ్ళుతున్నాను
నన్ను ఆశీర్వదించండి"—

చిన్నాన్న చనిపోయాడు—

ఆ తరవాత కొన్నాళ్ళదాకా చిన్నమ్మ మట్టిముద్దలా వుండేది
ఆమె యిప్పుడు రాయైపోయింది
నీవు ఆ యింటి ముందునుండి పోతుంటే నీ తల వంగిపోతుంది
నీ కాళ్ళు తొందరపెడతాయి

4

ప్రొఫెసర్ భట్టాచార్య ఆరోగ్యం
మామూలుగా లేదని తెలిసింది
చిత్రహింస - వేదన అతణ్ణి శిథిలం చేశాయి
అతని అరికాళ్ళు పగుల గొట్టారు
ముంజేయి చితకబాదారు
కళ్ళకేం చేశారో
అతనికిప్పుడు చూపు సరిగా ఆనడంలేదు
నాలుక అంగిట్లో తట్టుకుంటుంది
అతని మీద ఆరోపణ— విద్రోహం

తరచుగా అతణ్ణి విచారణ కోసం
కోర్టుకి తీసుకొస్తారు
అదే జైలు వ్యాను అతణ్ణి మళ్ళివెనక్కి తీసుకుపోతుంది
ఇలా అయిదారు సంవత్సరాలుగా జరుగుతూపోతున్నది—
ప్రొఫెసర్ భట్టాచార్య భౌతికశాస్త్రం బోధించాడు—
'అణుగర్భం చుట్టూతిరిగే ఎలక్ట్రాన్‌కి
నిజంగా బరువులేదు— కాని బరువులేని ఈ వస్తువులే
ఎలక్ట్రాన్ అణుస్వభావాన్ని నిర్ణయించ గలుగుతుంది
అంతా సంఖ్యలోనే వుంది
న్యూట్రాన్‌కి ధనవిద్యుత్తులేదు
కాని న్యూట్రాన్ సంఖ్యలో మార్పు
అణు స్వభావాన్ని మార్చగలదు'
నీవు నోట్స్ రాసుకున్నావు
అతడు చిరునవ్వు నవ్వాడు
అది బాధలోనో, అలక్ష్యంలోనో నీవు తెలుసుకోలేదు
చివరికి అతడు రావడం మానేశాడు
తరువాత ఒకనాడు
ఒస్తార్‌వీధి— గులాలోని ఒక మురికిపేటలో
పోలీసులు అతణ్ణి అరెస్టు చేశారని తెలిసింది
ఆరోపణ— విద్రోహం—

5 కళ్యాణి – రేఖ
మురికిపేట బడిలో చదువుకున్నారు
ఒకరోజు గూఢాచారి శాఖ జీపు
వాళ్ళను తీసుకుపోయింది
వాళ్ళమీద ఆరోపణ– విద్రోహం
ఎందుకంటే ఒక ఊరేగింపులో వాళ్ళు
“రాజకీయ ఖైదీలను విడుదల చేయాలి– పి. డి.
చీకటిచట్టం మీసాను ఎత్తివేయాలి” అని నినాదాలు చేశారు
విద్రోహం
ఎందుకంటే వాళ్ళు జనంతో కలుస్తున్నారని
వాళ్ళ జీవితాల్లో భాగం పంచుకొంటున్నారని అనుమానించారు

6 కర్జన్‌పార్క్, జూలై 20, 1974
పోలీసులు ఇనుప మేకుల బూట్లతో
ప్రబీర్ పొట్టమీద తొక్కిసలాడారు
నల్లని జైలు వ్యాను బీభత్సంలో
నిర్దాక్షిణ్యమైన లాఠీదెబ్బల వర్షంలో
ఆ పట్టణ ప్రజలు తెలుసుకున్నారు
‘వియత్నాం’ అనేమాట ఉచ్చరించడం విద్రోహమని–

నీ పాటలో విద్రోహం
నీ ఆటలో విద్రోహం
నీవూ నేనూ
మరి నీవూ, నీవూ, నీవూ
కలుసుకోవడం విద్రోహం
ఈ దేశంలో జీవించడం
విద్రోహం
విద్రోహం
విద్రోహం

[ఫిబ్రవరి, 1975]

పుస్తక పరిచయం :

# నూతన శిశువుకు ఆహ్వానం

'మేల్కొంటున్న గ్రామాలు', జనం 'జైత్రయాత్రలు' కవిగా నరసింగరావు 'జననం'కు కారణాలు. నరసింగరావు కవిత్వంలో నగరాల 'వర్మీలియన్' (పుస్తక చైతన్యంగా పేర్కొనదగిన అరుణిమ) నగర పొలిమేరల్లో ప్రజలకు తోబుట్టువైన పేదరికం తోబుట్టువుగా పుట్టిందే. అందుకే ఆయన కవిత్వంలో గ్రామాలు- క్యాన్వాసుపై పరచుకొని కనిపిస్తాయి. 'పల్లెపదాలు' ప్రాణప్రదంగా భావించుకునే కవి పాటలు రాసే ప్రయత్నం ఎక్కువ చేసినట్లుగా కనిపించదు.

కష్టజీవుల శ్రమ గురించి కవిలో సన్నిహిత పరిశీలన కనిపిస్తుంది. 'ఇక్కడ ప్రతి మనిషి తన కండకు దినమంతా పని కల్పిస్తాడు.' 'కాలం అతనికి కర్తవ్యాన్ని వేడు ప్రబోధిస్తున్నది' లాంటి మామూలు ప్రకటనల స్థాయి నుంచి ఆయన పరిశీలన 'జనం ఒళ్ళే జనం కళ్ళు' అనే కళాస్థాయికి ఒక్కొకచోట ఎదుగుతుంది. తన ఇంద్ర పదవిని ఇంద్రియ చాపల్యాన్ని వేయికళ్ళతో కాపాడుకొని, అనుభవించటానికి ఒళ్ళంతా కళ్ళుచేసుకున్న 'దేవేంద్రు'లను వేనోళ్ళ పొగిడి తమ నోటి తీట తీర్చుకున్న కవు లున్నరు మనకు. శ్రమజీవికి తన జీవితసత్యాన్ని ఏ పుస్తకమూ చెప్పనక్కర్లేకుండా దాచుకోవడానికి వీల్లేని ఒళ్ళేచెప్తున్నది. మనకు తెలుపులో దాగిన రంగుల్ని 'విశ్లేషించడానికి, సూక్ష్మ 'కళ్ళు' కావాలి. సమాజంలోని వర్ణాలను, వర్గాలను చదవ డానికి చైతన్యం 'కళ్ళు' కావాలి. శ్రమజీవికి అతని'ఒళ్ళు' ఒకటిడి ఒకచూపు. అతని ప్రతి చమట చుక్క అతనికి చైతన్యం చూపునిస్తున్నది. అపుడు బతుకులోని బాధల నిజంనుంచి 'అగ్నికళ్ళు' తెరచుకొన్నజనం 'జైత్రయాత్ర' సాగిస్తారు.

'బతుకుమీద చురకత్తి / మొలకెత్తి ఎగసింది
చేతిలోని మొన కొడవలి / మెడలెత్తి చూసింది
చెట్టుమొదలి గొడ్డలేమి / దెబ్బమెరుపు మెరసింది
పట్టెడిప్పి జెకముకేమి / ఛమక్ ఛమక్ మెరసింది
మెరుపులా దూది అంటి / నిప్పు రగులుకున్నది'

అని 'ఒక నిప్పురవ్వ మహాజ్వాలను రగిలిస్తుంది' అనే గతితార్కిక సత్యానికి అన్వయించి ప్రజాచైతన్యాన్ని తన చైతన్యం పదునుపెట్టుకోవడానికి, తనను తాను మరింతగా మలచు కోవడానికి మననం చేసుకున్నట్లుగా రాస్తాడు.

నిజమెకదా జరిగింది / నిజమేకదా వెలిసింది
నిజమెకదా జనం జనం / దినం దినం కదిలింది

ఇందులో పాఠకులను అంగీకరింపచేసే ప్రయత్నంకన్న తాను ఆమోదించ. డానికి ఆటాటన పయనించడానికి దారి తీసిన పరిణామాలను బిగ్గరగా ఆలోచిస్తున్నడా (లేడ్ థింకింగ్) అనిపిస్తుంది.

కదిలింది నిజమేలే / కమిలింది నిజమేలే
భగ భగమని ఆకసాన / కెగిసింది నిజమేలే

అప్పుడు మళ్ళివెనక్కివెళ్ళి చదివితే మొదటినుంచీ ఈకవిత అంతా 'జైత్రయాత్ర' ఎట్లా కవి చైతన్యాన్ని మలచడానికి సాగిందో అర్థంమవుతుంది.

అవునవును నిజంకదా ! / బతుకులోని బాధనిజం
బాధలున్న గాధనిజం / గాధలున్న మనిషినిజం
మనుషులున్న జగం నిజం / నిజం నిజం నిజం నిజం
కాదనలేం కాదనలేం—

నిజంకదా, కాదనలేం, నిజంసుమ్మీ— వంటి ప్రయోగాలు కవిముందు తను కన్విన్స్ (ఆమోదించి) కావడానికి చేస్తున్న ప్రయత్నాల్లా కనిపిస్తాయి. అందుకే ఈ కవితలో జనసం' కవి కవిగానేకాదు, ప్రజా చైతన్యంలోకి కళ్ళుతెరుస్తున్నడు. జనసం జనంలోకి.

"మన పూర్వకవులు తమ రచనల్లో ప్రకృతి సౌందర్యాన్ని కీర్తించడంలో పరవశించి పోయారు. చంద్రుని వెన్నెల, పుష్పసౌరభం, మంచుచల్లదనం, మలయ మారుతాలు, ఆహ్లాదం, సెలయేళ్ళ గలగలలో, గిరులగాంభీర్యం వారి కావ్యగానాలకు ఉత్తేజాన్నిస్తూ వచ్చాయి.

కానీ....

ఈనాడు మన కవితలలో ఉక్కు, ఇనుము కూడ వుండాలి. మన కవులు ప్రతిఘటనకు సైతం సిద్దపడి వుండాలి." (హోచిమిన్)

కళని జంధ్యాల్లాగ, పిలకల్లాగా, మనువులాగ, కాళిదాసులాగ, కన్ఫ్యూషియస్ లాగా వాడుకున్న వాళ్ళు.... కుంటు (తు)న్నవాళ్ళు వున్నారు.

'కాలం వేడిగావుంది / కళలు వాడిగా ఉంటాయి
అదను చూసి పదనుచూసి / బాకులా వాడుకోవాలి'

కాలంవేడిగా వున్నప్పుడు కళలు వాడిగా వుండకతప్పదు. 'అదను చూసి పదను చూసి' కాదు అదనుకు పదనుపెట్టాలి కళలు. ప్రజాచైతన్యాన్ని ప్రతిఫలించడమే కాదు ప్రజాచైతన్యానికి పదనుపెట్టే కెటాలిస్ట్ కావాలి ప్రజాకళాకారుడు. ఇదే అదను కాలం పదనుగావుంది (లోచన్)

'ప్రజలు శక్తిని రచిస్తారు / ప్రజలు శక్తిని నిర్మిస్తారు
ప్రజలు తమ జాతి / ఉవ్వెత్తు కెరటాల్లాలేస్తారు
ప్రజలు కళల్ని ప్రేమిస్తారు / ప్రజలు కళల్తో జీవిస్తారు
ప్రజలు కళలుగా ప్రకాశిస్తారు.'

కళలే ప్రజలు, ప్రజలే కళలు.

ఏనాన్ ఉపన్యాసంలో మావో చెప్తాడు- తాను విద్యార్థిగావున్న రోజుల్లో శ్రమను శ్రమజీవులను హీనంగ చూసేవాణ్ణని, కాని క్రమంగా శ్రమజీవి చెమటలో సౌందర్యాన్ని చూడ గలగడం నేర్చుకున్నానని. (శ్రమైక జీవన సౌందర్యానికి ఖరీదుగట్టే షరాబు లేదోయ్)

ప్రజలు కళలుగా ప్రకాశిస్తారనే విషయం 'ప్రజాయుద్ధ విజయాలను ప్రశంసించండి' అని రాతలో రాసిన లిన్‌పియావో కూడ అర్థంచేసుకో లేకపోయాడు. ప్రతిభాశాలురు, కళాకారులు ఆకాశంలోంచి ఊడిపడతారనే అనుకున్నాడు. జనచైనాలో సాగిన శ్రామికవర్గ సాంస్కృతిక మహావిప్లవంలో మారుమూల కమ్యూన్‌లలో పొలాల్లో ఫ్యాక్టరీలలో అభివృద్ధినిరోధక వర్గ సిద్ధాంతి కన్‌ఫ్యూషియస్‌ను, విప్లవ ప్రతిఘాతకుడు లిన్‌పియావోను సైద్ధాంతికంగా, వర్గపోరాట చైతన్యంతో నిరాకరిస్తున్న ప్రజలు కళలుగా ప్రకాశిస్తున్నరు, కళలుగా జీవిస్తున్నరు. కళలు ప్రజలుగా ప్రజలు కళలుగా లేస్తున్నరు.

జనం ఉప్పెనలా లేచినపుడు విప్లవం అడుగులో అడుగేస్తూ నడచిరాదు. నత్తలాగా తాబేలులాగానో సాగదు గంతులుగా, పరుగులుగా పెద్దపెద్ద అంగలు వేస్తూవస్తుంది.

గాలి అంతా / గంతు లేయగ
పరుగు పరుగున / కాళ్ళుపడగ....

'కోట్లాదిరైతులు ఒక ఉప్పెనలాగ లేస్తే' ఆ శక్తిఎంత అసాధారణమైందీ అంటే దానినేశక్తీ అణచజాలదు.' (మావో) అయితే ఆ విప్లవ ఉప్పెన గురించి 'గాలి అంతా గంతులేయగా' అనే గతితార్కిక సూత్రానికి కళారూపం యిచ్చిన కవి మిగతా కవిత

అంతా నాలుగు పేజీలు వొట్టిమాటలు పేర్చాడు. వ్యవసాయ విప్లవానికి, విప్లవ భూసంస్కరణల లక్ష్యానికి అన్వయించలేదు.

'అక్షరం' శ్రమజీవికి యిచ్చిన చక్కని అక్షర రూపం.

"నీముఖానికి ప్రేలాడే చెమటలో
సమస్త శ్రమజీవుల చెమట పొంగినట్లనిపించింది."
"నీ ముఖంలోని భావం రాయడానికి / నాకింకొక్క అక్షరమూ దొరకదు
శ్రమ జీవీ!"

'రక్తపు శిశువు రేపటి ఉదయం' కుంచెతో రాసినట్లుగానేవుంది. 'రంగుల్తో కుంచెల్తో కాన్వాసుల్తో మాట్లాడుతూ వాటినిండా మాటల్ని నింపుతా'నన్న లక్షణమే కళాకారుడుగా ఈ కవి బలహీనత. ఈ బలహీనత వల్లనే మాటల ఎకానమీ లోపించింది. బహుశా చిత్రకారుడుగా కూడ అందుకే ఇతని 'crazy of virmilion' కొన్ని క్లుప్తంగానూ, స్పష్టంగానూ, బలంగానూ వున్న కవితలు లేకపోలేదు.

'ఇక్కడ విప్లవాలు నిషేధం' చాల పదునుగా యీ వ్యవస్థను నిర్వచిస్తుంది.

'పొలాల్లో ఫ్యాక్టరీలలో / మనుషుల రక్తమాంసాలను కాల్చుకుంటారు
ఇక్కడ ప్రతిదీ చేస్తారు / చేయనిస్తారు
కాని / విప్లవాలు ఒక్కటే నిషేధం.'

ఇక్కడ విప్లవాలను అణచేస్తూ, విప్లవాలకు ద్రోహంచేస్తూ 'విప్లవం వర్ధిల్లాలి' అని కూడ అననిస్తారు. విప్లవాలను నిర్వచించడం కాదు నిర్వహించడం మాత్రమే ఇక్కడ నిషేధం. ఇంత తెలివి మీరిపోయింది ఈ దోపిడీవ్యవస్థ యివ్వాళ.

'మురికివాడ' ఒక మౌలిక ప్రశ్నను రేపుతుంది.

"అది మనుషులు నివసించే చిన్నవాడ / మురికివాడ
నాగరిక సమాజంలో / సంపన్నుల హయాంలో
ఆ వాడలో నివసించే వారంతా మురికి మనుషులు
పుట్టినపుడు అందరిలాగే / పుట్టి
ఇప్పుడు మురికివాళ్ళెలా అయ్యారు?"
"ఒకటి మురికి / వేరొకటి శుభ్రం
ఈ శుభ్రం 'మురికి'చే చేయబడింది
ఆ మురికి శుభ్రంతో తోయబడిందే."

'చర్య'లో ఆలోచనను 'చూపు'గా చైతన్యాన్ని 'ఊపిరి'గా భావించవచ్చు.

కొన్ని కవితలకు ఆ శీర్షికలు అట్లా ఎందుకు పెట్టాడో అర్థంకాదు- 'అగ్ని' అలాంటి కవిత.

"మెడలపై గానుగ నొగలే / మన నగలు"

అంతేకాదు అసలు నగలు కూడ బానిసచిహ్నాలే. వ్యక్తిగత ఆస్తి- దానిని కోరుకునే భావనతో ముడిపడి నగలు, బంగారంపై మమకారం, అవి అలంకారమనే భావన బయల్దేరినవి. కష్టజీవులకు గాయాలమచ్చలే ఆభరణాలు.

'రత్నగర్భ' మన మాతృదేశంలో
"రతనాలు రాజులే ఏరుకున్నరు / ప్రకృతికి అందాన్నిచ్చే రాళ్ళకి
అధినేతలు శ్రామికులున్నారు. / ఆరాళ్ళ రాపిడిగా
వాళ్ళలో చైతన్యం రగుల్కొల్పితే / ప్రకృతికన్న పదిరెట్లు ప్రకాశిస్తారు,"

'పల్లెపదాలు' ఒక్కసారి నరిసింగరావు మాటల, రంగుల ప్రపంచం నుంచి మనను నిసర్గమైన జానపద కళా సౌందర్యంలోకి తీసుకపోతాయి. ఆయన కూడ ఆయన చుట్టావున్న వ్యవస్థనుంచి అక్కడికి 'పదే పదే' పోవాలని బాధపడుతున్నట్లు వుంటుంది. పల్లెలను మింగేసిన పట్టణాలను పల్లెలు చుట్టుముట్టిననాడు ఆకళలు బతుకుతాయి.

"వెన్నెల రాత్రిలు గడ్డిబళ్ళు / కట్టెల బళ్ళు రకరకాల బళ్ళు
ఆ బళ్ళలో ఒళ్ళుమరచి / పెల్లెకిలా పడుకొని గానంచేస్తారు."
"చంద్రుడు బళ్ళను / దొంగలా వెంటాడుతాడు
పాటలు వినడానికి తెల్లవార్లు బండితోనే ప్రయాణంచేస్తాడు."

ఎంత హృద్యమయిన భావన. కామునిపున్నమిరోజు వెన్నెలకు ఊపిరినీ, నెత్తురునూ యిచ్చి గాలిని ఒక గానంగా మార్చిన ఎన్ని జాజిరిపాటలు. 'పొదల పొదల గట్లనడుమ పొడిచెనొక్క చందమామ' చంద్రుడే పులకించే పాట.

మొత్తం పాటంతా సుతిమెత్తని న్యారేషన్.

'కమ్యూనిజం' లోని నిజాన్ని కూడ బలంగా చెప్పిన పంక్తులు
"ప్రజల మాటలలో చేతలలో / జీవితాల రాపిడిలో
కమ్యూనిస్టులను పేరుచేసి / ఎంత మందిని చంపుతావు
ప్రజల కళ్ళ వెలుగు కమ్యూనిజాన్ని / ఏ బందిఖానాలో బంధిస్తావు"

కమ్యూనిస్టులకు కూడ కలలు, వెన్నెలలు వుంటాయనీ, అయితే అవి ఎవరో కొందరి సొత్తుగా వున్న ఈ వ్యవస్థ నుంచి ప్రజాపరమయ్యే వ్యవస్థ కావాలని కోరుకుంటారు వాళ్ళు. నల్లకుంట పోలీసు స్టేషన్‌లో రమేజాబీపై జరిగిన అత్యాచారము, ఆమె భర్త హత్య, ఆ తర్వాత పోలీసు వ్యవస్థపై వ్యక్తమయిన ఆగ్రహము– వీటిపై వ్యాఖ్యానిస్తూ డాక్టర్ చెన్నారెడ్డి 'అదంతా ఒక పీడకల– అది మరచిపోదాం' అన్నాడు గత ఏప్రిల్ 6 ఉదయం రేడియోలో మాట్లాడుతూ. కాని రమేజాబీలాంటి పేద స్త్రీల జీవితాల్లో, హరిజన గిరిజనుల, బలహీనవర్గాల జీవితాల్లో శతాబ్దాలుగ ఈ దోపిడీ వ్యవస్థ అమలుచేస్తున్న 'పీడకలలు' వాళ్ళెట్లా మరచిపోగలరు. మంత్రిగారు తలచుకుంటే పీడకలలు మరచి పీడకకలలే కనగలరు కాని పీడిత ప్రజలు పోరాట ఆచరణలో మాత్రమే మంచి కలలు కనగలరు.

ప్రజలకు వచ్చే కలలన్నీ జీవితాచరణ నుంచి వచ్చేవే. ప్రజాపక్షం వహించే కవుల కలలు కూడ జీవితాచరణలో పూసిన విరులు, ఊరిన జలలు, కాసిన వెన్నెలలు, కలలు ఈనాడు 'నెత్తుటి గీతాలు' 'రేపటి రూపాలు.'

'కళ్ళు!' మెరిసే కవిత. ప్రజల కళ్ళల్లోవుండేవి కన్నీళ్ళే అయినా అవి కన్నీళ్ళు మాత్రమే కాదని, కష్టజీవి కన్నీళ్ళలో కమ్మరి కొలిమి, రైలింజన్‌లోని ఎర్రటిబొగ్గు, ఎర్రగా కాలిన ఇనుము– కళ్ళు విప్పిన వానికి ఎరుపు మెరుపులు కనిపిస్తున్నాయి– ఇక్కడ నిజంగా హోచిమిన్ చెప్పిన ఉక్కు, ఇనుము కవిత్వంలో చోటుచేసుకుంటున్నాయి.

ఈనాటి కవులలో కొన్ని సిద్ధాంతాలకు, సూత్రీకరణలకు కళారూపం ఇవ్వాలన్న ప్రయత్నం చాల ఎక్కువగానే కనిపిస్తున్నది. కొంద రా విషయంలో బాగా కృతకృత్యులవుతున్నారు కూడ– జనచైనా కమ్యూనిస్టుపార్టీ 10వ మహాసభలో రూపొందించిన 'ఏటికి ఎదురీదే స్వభావం' కమ్యూనిస్టుది అనే సూత్రీకరణకు 'రెంజిమ్' పాట ఇందుకు సుప్రసిద్ధమైన ఉదాహరణ. అదే రిపోర్టులోని 'సరియైన పంథా అన్నిటినీ నిర్ణయిస్తుంది– తుపాకిని ప్రజలు శాసిస్తారు కానీ, తుపాకి ప్రజలను శాసించదు' లాంటి సూత్రాలకు 'లహరి లహరి లాహిరీ' పాటలో ఎన్‌కె కళాకృతి యిచ్చారు.

విప్లవ పోరాటంలో ఒక అడుగు ముందుకు వేయడానికే, శత్రువు బలంగా వున్నపుడు, మన బలం దెబ్బతిన్నపుడు రెండడుగులు వెనక్కి పేయాల్సి వుంటుందన్న సుప్రసిద్ధమైన లెనిన్ సూత్రీకరణకు 'ముందడుగు' కవితారూపం. ఎప్పుడు శత్రువును దెబ్బతీయాలో మాత్రమే కాదు, ఎప్పుడు శత్రువునించి దెబ్బ తప్పించుకోవాలో కూడ యుద్ధ వ్యూహంలో భాగమే నంటాడు సుప్రసిద్ధ ప్రజాయుద్ధ నీతిజ్ఞుడు

మావో. విప్లవం ఒక సరళరేఖ కాదు, వ్యాసరచన, విందుభోజనం కాదు, నల్లేరు మీది బండి నడక కాదు. ఓటమి, విజయము, ఓటమి, అంతిమ విజయంగా సాగే రెవల్యూషన్. యుద్ధ వ్యూహంలో అందువల్ల అవసరమైనపుడు రిట్రీట్ కూడ ఒక ముందడుగే– ఈ అర్థంలో ఈ మొత్తం పుస్తకంలోనూ ఎంతో అర్థవంతమైన శీర్షిక ముందడుగు. రిట్రీట్ అంటేనే రివిజనిజం, విప్లవద్రోహం అని రిమ్మ తెగులులో అరిచే అతివాద దుస్సాహసిక ధోరణులు ఇంకా ప్రబలంగా వున్నచోట ప్రజాయుద్ధ వ్యూహంలో భాగమైన రిట్రీట్‌ను 'ముందడుగు' అని చెప్పడం కవి ముందుచూపుకు, పరిస్థితుల అవగాహనకు నిదర్శనం. కవితకూడ శీర్షికకు తగిన సీరియస్‌నెస్‌తో ముందడుగు వేస్తుంది.

ఈసారి తానొక్కడు కదలలేదు. కాళ్ళు, కాళ్ళవేళ్ళు, చేతులు, చేతివేళ్ళు, తల, మెడ, నడుము, ఎముకలు, మోకాళ్ళచిప్పలు– అన్నీ నెమ్మదిగా కదిలాయి. ఇదేమిటి నేనులో, తనలో ఇవన్నీ లేవా? తానుకదలితే ఇవన్నీ కదిలినట్టుకాదా, అవునునిజమే, కాని వీరులే ప్రపంచ చరిత్రను మారుస్తారన్న వ్యక్తివాదంనుంచి తలమొదలుకొని, కాళ్ళ వేళ్ళవరకు శరీరభాగాలన్నీ నిర్వహించే శరీర ధర్మాన్ని విడమరచి ప్రజలు చరిత్ర నిర్మాతలన్న స్పృహలోకి ఈ తరాన్ని మేల్కొల్పడం కవి బాధ్యత. పోతే ఈసారి పునాది కూడ చాల బలంగావుంది

అన్నిటికన్న ఈసారివేసిన 'ముందడుగు' లో వ్యవసాయ విప్లవ చైతన్యం మరీ కొట్టొచ్చినట్లుగా వుంది. భారతదేశంలో, ఆ మాటకొస్తే, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల్లో 'భూమి' కేంద్రింగాలేని విప్లవాలు విప్లవాలు కావు

"పరిసరాలు పరీక్షగా చూసి / చేతివేళ్ళతో భూమిని వొత్తి
మోకాళ్ళతో నేలను అదిమి."

మెల్లగా మెల్లమెల్లగాలేచి నడుములకు చేతులాన్చి తలపైకెత్తి చూసాడు. ఇప్పుడు 'నేల విడిచిన సాము' కాదుగనుక 'బలంగా రెండడుగులు' వేయగలడు.

'మరబ్రతుకులను మహాశక్తిగా' మలచాలంటే 'పొడిమాటలను పిడిబాకులు' గా మలచ వలసిందే. ఈ సంకలనమంతా నిజంగా పొడిమాటలు పిడిబాకులు కాగలిగితే 'కళ్ళు అగ్నిచిమ్మ గళంవిప్పుకున్న సంగీతంగా ఈ గీతం' వినిపించి వుండేది.

హోచిమిన్ కవితాశయాలనే కాదు జీవితాశయాలను ఆదర్శంగా తీసుకున్న కవి సహజంగానే వియత్నాంను 'రక్త సూర్యుని ఆకాశరూపం' గా ఆవిష్కరించాడు. 'వియత్నాం ప్రపంచ ప్రజలకుగ్రామం. ప్రపంచ ప్రజల ఏకైకగ్రామం.'

"వియత్నాం! వియత్నాం!! / వినిపించావు నీవు
సముద్రికెరటాల సంగీతాన్ని/చూపించావు/సంకుల పోరాటాల జాతి జీవితాన్ని"

'నేస్తం' గంభీరమైనకవిత. మామూలుగా ఒక కామ్రేడ్, ఎప్పుడో ఒక్కసారి ఏ అజ్ఞాతంలోనో కలుసుకున్న కామ్రేడ్, భుజం తట్టినట్లుగా 'క్రమంగా మొగ్గలా జ్ఞాపకం వికసించి' స్ఫురణకు వచ్చినట్లు సాగుతుంది. కానిదృశ్యాలు, చెట్లసందులు వెలుగురేఖలు, ప్రశాంత ప్రకృతి, మొగ్గలావికసించడం వంటి ప్రకృతికి సంబంధించిన మాటల ద్వారా మన నౌకవైపు నడుపుతున్నాడు.

"రెండు చేతులు దృఢంగాకలిశాయి / ప్రకృతిలో సమాజం రెక్కలు విరిశాయి
చుట్టూతా లోకం దృశ్యమై వెలిగింది."

తాను ప్రకృతి. పలికించిన కామ్రేడ్ సమాజం. ప్రకృతీ, సమాజమూ ఒకే గతిశీల సూత్రాలతో నడుస్తాయన్నది ధ్వని. ప్రకృతిలో (మానవ ప్రకృతిలోకూడ) సమాజం రెక్కలు విరిసినపుడు— రెండు చేతులు దృఢంగా కలిసినపుడు చుట్టూతావున్న లోకం దృశ్యమానం కావడమేకాదు, వెలుగుతుంది— మారుతుంది.

శ్రమజీవి నెత్తురు చెమటగా మారుతున్నది—

"ఈ ప్రపంచాన / ప్రతిదీ / చెమటబొట్లతోనే"

ఇపుడు 'నిర్ణయం కావడంలేదు'. నిర్ణయం కావలసిన సమాజం మనం కోరుకుంటున్నాం. ఇప్పుడు ప్రతిదీ చెమటబొట్లతోనే నిర్మాణం మాత్రం అవుతున్నది. ఇప్పుడీ "చెమట కోటి కోటి కన్నీటి చుక్కలు— నెత్తురు చుక్కలు— ఎండిన పేదల గుండెలు." రేపు ఒక మహా ప్రవాహం— జలపాతం— శిలా జీవితాన వెన్నెల— రేపటి నిర్ణాయక శక్తి.

"మన్ను"— గురించిన ఆలోచన ఆసియా ఖండంలో మస్తిష్కంవున్న ప్రతివాడూ చేసినపుడే చైతన్యవంతుడవుతాడు. కష్టజీవుల రక్తమాంసాల్లో, కలల్లో, పంచప్రాణాల్లో 'మన్ను' ఒక విలువయిన, ప్రాణప్రదమైన భావన. (ఈ జీవితసత్యమైన భూమి ఎంత ప్రాణప్రదమైందో ఈజిప్షియన్ చిత్రం 'భూమి' చూస్తే అర్థమవుతుంది) ఈ మన్ను నుంచి అన్నం, బంగారం, ధనం, అంతస్తులు ఒకటేమిటి భూమిమీద వున్నవన్నీ సృష్టింపబడుతున్నాయి. కాని ఇవి సృష్టించిన కష్టజీవి మన్నులో అన్నం మెతుకులకోసం ఏరుకునే ముష్టివాడుగా బతుకుతున్నాడు. భారతదేశానికంతా ధాన్యాగారమైన దివిసీమ కోస్తా ప్రాంతం ఉప్పెన, తుఫానులకు గురియై పల్లెకార్లూ,

పేదజనం నిరాశ్రయులైనపుడు– వాళ్ళను ముష్టివాళ్ళగా, బిచ్చగాళ్ళగా ట్రీట్‌చేసిన ప్రభుత్వ 'దాతృత్వం' ఈ సంస్కృతినే పోషిస్తున్నది.

'మహాసంక్షోభం గొప్ప శాంతికి దారితీస్తుంది,' ప్రజాయుద్ధ లక్ష్యం నిజమైన శాంతికోసం. పావురాలను శాంతితో పోల్చే 'సంప్రదాయం' మనకుంది. కాని ఆ పావురాలు తెలంగాణలో వేలాది జనాన్ని రైతాంగ విమోచనోద్యమంలో ఊచకోతకోసి ఎగిరేసిన జవహర్లాల్ కపోతాలు కావు–

"తూరుపు గుండెల్లోంచి / ఉదయిస్తున్న / అగ్నిగుండం"

సూర్యుడు నిద్రిపేల్కొని నలుదెసలా విప్పుకున్న రెక్కలు.

ప్రజల కోసం వీరులై "పుడమిపుత్రులు" ఎంత ఉజ్వలమైన కలకని, ఆ కలను ఆచరణలోకి తేవాలని అమరులయ్యారో 'పుడమిపుత్రులు' లో చెప్తాడు– ప్రజల కోసం పోరాడి మరణించిన వారిని 'పుడమిపుత్రులు' గా చెప్పడమే ఎంతో సహజంగా వుంది. ఐతే ఇదే శీర్షికతో చెరబండరాజు సుప్రసిద్ధమైన కవిత ఒకటి వున్న దనుకుంటాను. కవితలో పోలికల్లేకున్నా శీర్షిక వెంటనే ఆ కవితను గుర్తుకుతెస్తుంది– వస్తువుకూడ ఇదే.

"పనిపాటలవాళ్ళు పనిని పాటలతోకలిపి రాటుదేలుతారు. కథలు వెతలు పాటల లతలుగా పనికి ప్రాణంగా పల్లవిస్తాయి." కాని "చిటారుకొమ్మల్లో నయ్యాట లాడుతున్న సుఖం"(?) ఎవరిదని ప్రశ్నించి

అయితే ఈ వ్యత్యాసాల్ని చూసి అరవకు
అరిచే వారిని కరిచే కుక్కలున్నాయి కనుక.

"సమాజవాదీ ! / సమయాసమయాలు చూసి
పహరాకాయి." అనిహెచ్చరిస్తాడు.
"నావికుడు గాలి వాలు చూస్తాడు" / వైద్యుడు నాడి చూసి నట్టే
సమాజరుగ్మతకు వివేకవంతుడు / జనం నాడి చూస్తాడు."

అని చెప్పినచోట 'వైద్యుడు నాడి చూసినట్టే' అని చెప్పవలసిన అవసరం లేదు. రుగ్మత, నాడి అనే మాటలు ఆ అవసరాన్ని తీరుస్తూనేవున్నాయి.

"ఈ నీతులకు / ఉక్కు చట్రాలకు
అలవాటు పడ్డవాళ్ళే / వాటిని పిండికింద మారుస్తారు."
"అప్పుడు నీతి నోళ్ళు విస్తుపోతాయి"

సామాన్యంగా కమ్యూనిస్టులు హింసను విధ్వంసనాన్ని క్రోధాన్ని రెచ్చ గొడ్తారని నిందవుంది. కాని శాంతి వచనాలు చెప్పేవాళ్ళే ఇవి రెచ్చగొడ్తారు. 78 ఏప్రిల్ 6వ తేదీన అరెస్ట్ చేసిన నల్లకుంట పోలీసుస్టేషన్ సబ్ఇన్స్పెక్టర్‌ను, పోలీసులను నేరం జరిగిన మార్చి 31వ తేదీరోజే చేసివుంటే రాష్ట్ర వ్యాప్తంగా ఇన్ని ప్రాణాలు ఇంత ఆస్తి నష్టమయి వుండేవా? కనుక క్రోధాన్ని రెచ్చగొట్టే వాళ్ళెవరు?

"కోపాన్ని కోపంగానే కాక వివేకవంతుని ఆయుధంగా, ప్రకాశంగా వాడిననాడే దేశానికి వేడీ-వాడీ" అని చెప్పేవాళ్ళు కమ్యూనిస్టులు. 'కోపం' మంచి కవిత.

'నీవు' ఒక విచిత్రమైన అనుభవం. వెన్నెల సామాన్యంగా అహ్లాదాన్ని సంతోషాన్ని ఇస్తుంది. ప్రబంధాల్లో విరహాలకు మాత్రం ఇది బాధాకరమైతే, ఈ కవితలో అజ్ఞాతంలో వున్న వ్యక్తికి ఇబ్బందికరంగా వుంది. ఇది ఒక వ్యక్తి ఇంకొకవ్యక్తి గురించి సంబోధించినట్లుగా ప్రారంభమై చాలవరకు రొమాంటిక్ గీతంగా అన్పిస్తుంది. దీనికి ముగింపు కొసమెరుపులాగుంది.

'చస్నాలా' బొగ్గుగని కార్మికుల దుర్మరణానికి స్పందించి రాసిన సుదీర్ఘ కవిత ఉండ వలసినంత బలంగా లేదు. అక్కడక్కడ మాత్రం స్పందన వుంది.

"గుడిసెలలోకి / గూడాలలోకి / సంతోషం / సముద్రమైపోలేదు.
కన్నీళ్ళు కాలువలు కట్టాయి / చూడు / ఉదయం ఒక్కోచోట
ఒక్కో రకంగా / ఎలా ఉదయిస్తుందో. / అది చస్నాలా."

అయితే ఒక్క చస్నాలా సంఘటన ఆధారంచేసుకోని ఈ దేశంలో కార్మికుల చరిత్ర కూడ వివరిస్తాడు కవి.

"వారి జీవితాలకు ఏగ్యారంటీ లేదు. / వారి పేరే కార్మికులు
రెండు చేతులు వారి ఆస్తి

ప్రపంచ వ్యాప్తంగా కార్మికుల పోరాటాల గురించి కూడ వివరిస్తాడు. సమ్మె నుండి విప్లవం వరకు సాధించింది కార్మికులుకాక మరింకెవరని ప్రశ్నించి ప్రపంచ కార్మిక ఐక్యత ప్రతిస్పందించే చరణంతో పై చరణాలన్నిటికి బలాన్నిస్తాడు. "జీవ న్మరణ సంగ్రామం వారి ఊరు."

"చస్నాలా కార్మికుల రక్తధార / ఎలా మెరుస్తుంది.
తన వారసులకు ఏసందేశం / గానం చేస్తోంది." అని
వాటిచప్పుడు వినగల గుండె / ఎర్ర దండులో కలవాడికే ఉంది అంటాడు.

లిన్‌పియావో పేరు ఎక్కడా తీసుకోకుండా లిన్-పియావో భావాలకు ఆదర్శమైన కన్‌ఫ్యూషియస్‌ను అతని భావాలను ఎండగడతాడు. దృశ్యం ద్వారా మాన్‌స్టర్ (లిన్‌పియావో) ను మనకళ్ళకు కడతాడు.

ప్రజలకొరకు మరణించడం హిమాలయాలకన్నా ఉన్నతమైంది అందుకే ప్రజలకొరకు మరణించిన విప్లవకారుడు నాగరాజు, కవి హృదయంలో హిమశిఖరంగా నిలిచిపోయాడు.

చిత్రం గీయడంలోవున్న ఇబ్బందుల గురించి "చిత్రం-2" లో చెప్పుకుంటూ "అన్ని ఇబ్బందులూ వస్తువువేడిలో సర్దుకుంటాయి" అని అంటాడు కాని "జననం" లో అన్ని ఇబ్బందులూ వస్తువు వేడితో సర్దుకున్నాయని చెప్పలేం. వస్తువుమాత్రమే రూపంలో లేని కళను సాధించదు. బహుశ, వస్తువువేడి ఇటువంటి చోట్ల కవిలో కలిగించ వలసినంత తీవ్రతను కలిగించలేదనుకోవాలి. "చెడ్డకళ మంచి రాజకీయం కాజాలదు" (bad art cannot be good politics) కాబట్టి మంచి వస్తువు ఎన్నుకుంటున్నాననే ధీమాయే కవికి ఇది చాలు నేను కవిననిపించుకోడానికి అనేభ్రమను కల్గించకూడదు. ప్రజాకళలు సృష్టిస్తున్న వారిపై ఈ బాధ్యత మరింత ఎక్కువగా వున్నది. ఎందుకంటే ఇది ఎవరో కొందరి సొత్తుకాకుండా ప్రజలందరి సొత్తుకనుక ప్రజల గుండెల్లో పొదవుకొనే బలం దీనిలో వుండాలి.

"శ్వాసచివర మరో ఆలోచనాకెరటం లేస్తుంది"

ఇట్లా ప్రతి చరణంలోనూ ఊపిర్లు ఆలోచనకెరటాలూ, ఆలోచనకెరటాలు ఊపిర్లూ కాగలిగితే, అనుభూతి, ఆలోచనా పెనవేసుకొన గల్గితే ఈ "జననం" జనం గుండెల్లో ఎర్రజెండా గా నిలుస్తుంది. అయితే ఈ కవికి జననం ఇప్పటికి జననమే.

– ప్రొత్సాహి

---

జననం – కవితా సంకలనం – బి. నరసింగరావు
యుగ ప్రచురణలు, హైదరాబాదు – వెల: 2-50 – పేజీను 8+104
ప్రతులకు: 1. దేశీ బుక్‌హౌజ్, నారాయణగూడా, హైదరాబాదు
2. సృజన, హనుమకొండ, వరంగల్ - 506 001



సంస్మరణ :

## కనబడని ఊహ నిన్ను కబళిస్తే....

ఎవరు దుఃఖించారులే, నేస్తం! నువ్వు చనిపోతే,
ఏదో నేనూ, ఆరుగురు స్నేహితులూ తప్ప!....
సానుభూతి సభలలో ఎవరూ
సాశ్రు నేత్రాలు ప్రదర్శించలేదులే నీకోసం!

అతడు చనిపోయాడు. అతనికోసం జెండాలు అవనతం కాలేదు- పత్రికలు పట్టించుకో లేదు- 'స్వాతంత్ర్యం'తోపాటు పెరుగుతున్న మూడుతరాలు ఆయన గురించి విననేలేదన్నా ఆశ్చర్యం లేదు. ఎందుకంటే మనం 'మహాత్ముల' మిథ్యాగాథల గాలిమేస్తూ ఎదుగుతుంటే ఆ గాథల పునాదులపై బిర్లాల దోపిడీ పరిశ్రమల మందిరాలు ఆకాశాల నంటుతున్నాయి.

అతనిపేరు అనంతసింగ్. మనలో చాలమంది అతని పేరే వినకపోవచ్చు. ఐసిఎస్ ఆఫీసరు గాంధేయుడై ఖద్దరు వడికి నాయకుడై అహింసను ప్రబోధిస్తుంటే అతని పోలీసులు వ్యవసాయ కార్మికులపై, భూమిలేని నిరుపేదలపై కాల్పులు జరుపుతుంటారు. చట్టం పారిశ్రామికవేత్తల చెత్తబుట్టలో అడుక్కు పడిపోతుంది. అతని పేరు విననిచ్చే దెవరు?

మరణించిన అతని పేరు అనంతసింగ్. ఢిల్లీ జాతీయ దిన పత్రికలు ఆరింట్లో ఒకటి మాత్రమే ఈవార్త ప్రచురించింది. 1929-39 లో అతడు చిటగాంగ్ ఆయుధాగారంపై జరిగిన విప్లవకారుల దాడికి ఫీల్డ్‌కమాండర్. బ్రిటిష్ బానిస సంకెళ్ళను తెంచడానికి టెర్రరిస్టు చర్యలు చేపట్టాలని విశ్వసించి పోలీసు స్టేషన్లపై, బ్యాంకులపై దాడులుచేసి చిటగాంగ్ జిల్లాను అక్షరాల అదుపులో పెట్టుకున్న 53 మంది యువకుల్లో అనంతసింగ్ ఒకడు.

అనంతసింగ్ 75 సంవత్సరాలు 'జీవించి' మరణించాడు. కొద్ది నెలల కిందనే 'స్వతంత్ర' భారత కారాగారాల నుండి విడుదలయ్యాడు. ఈ చిటగాంగ్ యోధుణ్ణి నిన్నమొన్నటిదాకా రాజకీయ ఖయిదీగా గుర్తించడానికే నిరాకరించింది జ్యోతిబసు 'వామపక్ష' ప్రభుత్వం. 35 సంవత్సరాలు అతడు జైళ్ళలోనే గడిపాడు. '47 తర్వాత ఏడుసార్లు జెయిలుకుపోయాడు. నక్సల్బరీ దశాబ్దమంతా జెయిల్లోనే గడిచిందాయనకు. బ్రిటిష్‌వాళ్ళు అతన్ని బంధించారు- ఎందుకంటే అతను వాళ్ళకు వ్యతిరేకంగా పోరాడాడు. ఖాదీ ప్రభుత్వం అతన్ని బంధించింది- వాళ్ళకు వ్యతిరేకంగానూ అతను పోరాడాడు. 'ఎర్రజెండా' ప్రభుత్వం కూడ అతన్ని బంధించింది- దానికి వ్యతిరే

కంగా కూడ అతను పోరాడాడు. ఈ 'మార్క్సిస్టుల' ఎర్రజెండా వెలిసిపోయిందని రక్తవర్ణమొక్కటే నిజమైన రంగని ఆయన విశ్వసించాడు.

'అనంత' విప్లవకారుడు 'వామపక్ష ఐక్యసంఘటన' ప్రభుత్వంలోని 'మార్క్సిస్టుల' పార్లమెంటరీ సీట్లకింద ఎప్పుడూ డైనమైట్‌గానే కనిపించేవాడు. బ్యాంకు దోపిడీల ఆరోపణపై అప్పటి పోలీసు మంత్రి జ్యోతిబసు అతన్ని అరెస్టు చేయించాడు. తనకోసం భవనాలు నిర్మించుకోవడానికి అనంతసింగ్ బ్యాంకు దోపిడీలు చేసాడని ఆరోపించాడు. కాని ప్రజలకు తెలుసు- ఎవరు దోపిడీలు చేస్తున్నారో, ఎవరు భవనాలు నిర్మిస్తున్నారో.

ఆస్తమా జబ్బుతో బాధపడుతున్న అనంతసింగ్‌ను విచారణలేకుండా జైల్లో కుక్కారు. వైద్యసహాయంలేదు. చివరకు ఒక లక్ష్యంకోసం కాగితపు శాసనాలను ఖాతరుచేయని విప్లవకారుణ్ణి 'దోపిడీదొంగ'గా చిత్రించారు.

'నాకు చట్టంలో విశ్వాసంలేదు- అంతకన్నా ఎంతో ఉన్నతమైన నీతిలో తప్ప' అన్నాడు అనంతసింగ్. అయన మొరార్జీ దేశాయ్ కాదు, మహాత్మా గాంధీ కాదు. వాళ్ళిద్దరూ చిన్నచిన్న నియమాలను ఉల్లంఘించారు; వ్యవస్థను చెక్కుచెదరనీకుండా. అనంతసింగ్ ఈ వ్యవస్థకు పునాదియైన చట్టాలను భూమట్టం చేయడానికి పెకిలించాడు. అందుకే ఆనాడు 'బ్రిటిష్ ఇండియా సామ్రాజ్యాధిపతిపై యుద్ధం ప్రకటించిన' నేరానికీ, ఈనాడు 'చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వంపై యుద్ధం ప్రకటించిన' నేరానికీ బానిస భారతమూ 'స్వతంత్ర' భారతమూ ఒకే చట్టాన్ని ఉపయోగించి అవే జెయిళ్ళలో పెట్టింది ఆయనను.

చివరకాయనను స్పెషల్ కోర్టులో విచారించాలనుకున్నారు. కోర్టు విచారణ కొండవీటి చాంతాడు. ఆయన ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. తరచు ఆసుపత్రికి తరలించాల్సి వచ్చింది; కాని మంచానికి గొలుసులతో కట్టివేసే. ఇంక కోలుకోడని నమ్మకం కుదిరినాక ఆయనను కొద్ది నెలలకిందే వదిలేసారు.

గుండెజబ్బుతో ఆయన మరణించాడు. ఆయనకోసం అధికార జెండా అవనతంకాలేదు; 'ఎర్ర'పాలకుల బెంగాల్‌లో కూడ. ఆ వెలిసిపోయిన జెండా ఆయనకోసం కన్నీళ్ళు కార్చాలని కూడ మనం కోరుకోవద్దు- కార్చినా అవి 'మొసలికన్నీళ్ళు' అని మనకూ ఆయనకూ తెలుసు.

లేదు, నేస్తం! లేదు.... / నీ ప్రాభవం మమ్మల్ని వదలలేదు!
ప్రతికూల శక్తుల బలం మాకు తెలుసు,
భయం లేదులే అయినప్పటికీ!
నీ సాహసం ఒక ఉదాహరణ!

(సుమంతోబెనర్జీకి కృతజ్ఞతలతో)

**SRJANA Telugu Monthly March 79** **H/WL-10**
Regd. No. with Registrar of News Papers 10953/67

## సృజనాత్మక ప్రకటనలకు 'సృజన'

సృజన ఇక నుంచి పుస్తక విక్రేతల, ప్రచురణ కర్తల తదితర ప్రజాహిత రంగాల ప్రకటనలు వేయదల్చుకున్నది. పదమూడు సంవత్సరాలుగా ఆంధ్ర దేశం లోనూ, బయటా విశేష ప్రచారంలోవున్న సృజనలో మీ ప్రచారం కొరకై ప్రకటించండి.

| ప్రకటన రేట్లు | |
|---|---|
| చివరి అట్ట | రు. 300 |
| చివరి అట్ట (రెండు రంగులలో) | 350 |
| రెండవ, మూడవ అట్టలు ఒక్కొక్కటి | 200 |
| మొదటి పేజీ | 150 |
| లోపలి పేజీ | 100 |
| అర పేజీ | 60 |
| పావు పేజీ | 40 |

ఒక ఏడాదిలో వాడుకునే
12 పేజీలకు 25% తగ్గింపు.

| కొలతలు (సెం.మీ.) | |
|---|---|
| సృజన కొలతలు : | 20×13.4 |
| ప్రకటన కొలతలు : | |
| పూర్తి పేజి | 16.6×11 |
| అర పేజీ | 8.3×11 |
| పావు పేజీ | 8.3×5.5 |

# *SRJANA FOR CREATIVE ADVERTISEMENTS*

### ADVERTISEMENT TARIFF

Rs.

Last Cover Rs. 300 — Last Cover (two colours) 350
2nd, 3rd Covers - each 200 — Fisrt page 150
Full page 100 — Half page 60
Quarter page 40 — 25% less on contract basis for 12 pages.

SRJANA full arca: (cm) 20×13.4 —

Printing area: (cm)
Full page 16.6×11
Half page 8.3×11
Quarter page 8.3×5.5

SRJANA
Hanamkonda, Warangal 506001

**Rs. 1-50**